# కృష్ణాపత్రిక సాహిత్య సేవ-
# ఒక పరిశీలన




-ముట్నూరి కృష్ణారావు సంపాదకత్వ కాలం-

## లఘు సిద్ధాంత వ్యాసం

ఉత్తమ పరిశోధనా గ్రంథంగా తెలుగు విశ్వవిద్యాలయం
బంగారు పతకం పొందిన సిద్ధాంత వ్యాసం



డా॥ సాదనాల వేంకట స్వామి నాయుడు
ఎం.ఏ.,బి.ఎల్ బి.ఎల్.ఐ.సి., బి.ఇడి , ఎం.ఫిల్., పిహెచ్ డి.,
ఆంధ్రోపన్యాసకుడు.

తెలుగు పరిశోధనారంగంలో మొట్టమొదటిగా
ఒకే పత్రికపై జరిపిన పరిశోధన

సాదనాల ప్రచురణలు
రా జ మ ం డ్రి

LITERARY CONTRIBUTION MADE BY KRISHNA PATRIKA - A REVIEW
(The Period of Mutnuri Krishna Rao's Editorship) M. Phil., Thesis.

by Dr. Sadanala Venkata Swamy Naidu



First Edition : February, 1994

Copies : 1000

Price : Rs. 30-00

Cover Design : Seela Veerraju

---

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రితం

---

For Copies :

1. Dr. SADANALA VENKATA SWAMY NAIDU
M.A., B.L., B.L.I.S., B.Ed., M.Phil., Ph.D ,
Lecturer in Telugu
29-1-28.1, Devi Chowk,
Rajahmundry-533 104.
Phones : 72873 (Res), ~~76651 (Offi).~~

2. VISALANDHRA PUBLISHING HOUSE
4-1-435, Vijnana Bhavan, Bank Street,
Hyderabad-500 001.
and its Branches

Cover Printed at : Sri Balaji Art Printers,
Chikkadapalli, Hyderabad.

Printed at : Maheswari Printing & Binding Works
Rajahmundry.

# అంకితం

నా యీ స్థితికి కారకులైన

పిన తల్లిదండ్రులు—

కీ॥ శే॥ సాదనాల నాగేశ్వరరావుగారికీ

శ్రీమతి వీర వేంకట రాఘవమ్మకూ

ప్రేమతో—

మీ

తాతాజీ

# రెండు మంచి మాటలు

సాహిత్య లోకంలో 'కవీనాం కవులు, లోకానాం కవులు' అని రెండు తరగతుల వారుంటారు. అలాగే పరిశోధనారంగంలో సామాన్య సాధారణ పాఠకులకు కూడా పనికివచ్చే పరిశోధనలు, కేవలం పరిశోధకులకు మాత్రమే ఉపయోగపడే పరిశోధనలు ఉంటాయి. శ్రీ సాదనాల వేంకట స్వామి నాయుడు తెలుగు విశ్వవిద్యాలయానికి ఎం. ఫిల్. పట్టాకోసం సమర్పించిన లఘుసిద్ధాంత వ్యాసం 'కృష్ణాపత్రిక సాహిత్య సేవ-ఒక పరిశీలన (ముట్నూరి కృష్ణారావు సంపాదకత్వ కాలం) పరిశోధకులకు చాలా తోడ్పడే గ్రంథం. ఈ కృషి ప్రశంసనీయం.

ఇటీవల కాలంలో ఇటువంటి పరిశోధనలకు శ్రీకారం చుట్టినవారు (బహుశా) శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారు. నేను సమగ్ర ఆంధ్ర సాహిత్యం రాసే రోజుల్లో నెల్లూరు వర్ధమాన సమాజానికి వెళ్ళి కొన్ని సమాచారాలకోసం పాత పత్రికలు గాలిస్తూ ఒక వ్యాసం కోసం కొన్ని గంటలు ఖర్చు పెట్టడం చూసి ఆయన పరిశోధకుల పాట్లు గుర్తించి 'వ్యాస రచనల సూచిక' అని ప్రశంసనీయ గ్రంథం తయారు చేశారు. అది సంకలనం చేయడానికి కారణాన్ని మొట్టమొదటే చెపుతూ నేను పడ్డ పాట్లు వివరించారు. శ్రీ కృష్ణమూర్తిగారి పరిశోధనలో కృష్ణాపత్రిక చోటుచేసుకోలేదు. అప్పుడే కృష్ణాపత్రిక గురించి ఎవరైనా శ్రద్ధగా సూచికను తయారుచేస్తే బాగుండునని అనుకున్నాను. ఆ సత్కార్యం సాదనాల వేంకట స్వామి నాయుడుగారు పూర్తి చేశారు. అందుకు వారు అభినందనీయులు.

తెలుగు పత్రికల చరిత్రలో కృష్ణాపత్రికకు ఒక విశిష్ట స్థానం ఉంది 'ఆంధ్ర దేశంలోని సాహిత్య సంఘాలు' అనే వ్యాసం రాస్తూ అందులో శ్రీశ్రీ "ఇంచుమించు ఇరవయ్యో శతాబ్దంతో పుట్టి దానితోబాటు ఎదుగుతూ వస్తున్న 'కృష్ణాపత్రిక' సంపుటాలకోసం నా లైబ్రిరీలో ప్రత్యేకం బీరువా ఉండాలి మంచి గంధపు చెక్కలతో దాన్ని తయారుచేస్తే మరీ మంచిది' అని రాశాడు. (శ్రీ శ్రీ వ్యాసాలు-పు. 72) కృష్ణాపత్రికలో ఒక రిపోర్టు చదివి దానివల్ల ఉద్వేగంతో ప్రభావితుణ్ణై నేను నా 'త్వమేవాహం' రచించడం జరిగింది.

ఈ లఘు సిద్ధాంత వ్యాసంలో నాలుగు ప్రకరణలున్నాయి. నాలుగో ప్రకరణం 'కృష్ణాపత్రిక-సాహిత్యం' పదకొండు శీర్షికలలో వింగడించి 1902 నుంచి 1945 దాకా సవివరంగా శ్రీ సాదనాల పొందుపరిచారు వీటివల్ల ఎన్నో ఉపయోగాలున్నాయి ఈ గ్రంథాన్ని ప్రకటించటం శ్లాఘనీయమైన కార్యం. వీరు కృష్ణాపత్రిక గురించి చేసిన పరిశోధన వంటిది కొన్ని ఇతర పత్రికలు (ఉదా : ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1930_50 దశకాల మధ్య) గురించి కూడా ఇతర పరిశోధకులు లఘుసిద్ధాంత వ్యాసాలు రాయడం చాలా అవసరం. ఆంధ్ర దేశం ఇప్పుడిప్పుడే ఇటువంటి రిఫరెన్సు గ్రంథాల ప్రాముఖ్యాన్ని గుర్తిస్తోంది. ఇది సంతోషించదగ్గ విషయం. ప్రోత్సాహించదగ్గ అంశం.

త్యాగరాయనగర్ డా॥ ఆరుద్ర

20_12_1992

# ఒక మాట

ఆంధ్ర జన జీవితంలో సాంస్కృతిక ఉజ్జీవనంలో కృష్ణాపత్రిక ఒక శాశ్వతమైన అధ్యాయాన్ని ఆక్రమించింది. కొండా వెంకటప్పయ్య పంతులు దేశభక్తి, కృష్ణారావుగారి సాహితీ ప్రక్రియ, ఆనాటి ప్రముఖుల రచనలు నవ్యాంధ్రకు రూపురేఖలు దిద్దాయి. భారత స్వాతంత్ర్య పోరాటంలో భాషారాష్ట్ర ప్రబోధంలో, ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమంలో, స్వదేశీ ఉద్యమంలో, గ్రామీణ పారిశ్రామిక అభివృద్ధికి మార్గదర్శకత్వం చూపడంలో కృష్ణాపత్రిక గాంధీజీ కలలుగన్న గ్రామీణ స్వరాజ్య రూపానికి నాంది ప్రస్తావన చేసింది. ఇందులోని వ్యాస ధోరణులు, సాహితీ ప్రక్రియలు, కవితా ప్రబోధాలు వచన రచనా రీతులు ఒక యుగాన్ని సృష్టించాయి. వాటిని ఒక చోట సూక్ష్మంగా, ఒకచోట స్థూలంగా మరొకచోట పరిశీలనాత్మకంగా పరిశోధన చేసి రచించిన ఈ విమర్శనాత్మక వ్యాసం పాఠకులకు చారిత్రిక దృష్టి, సమకాలీన పరిణామాలు అందించగలుగుతుంది. ఈ కృషి చేసిన రచయిత సాదనాల వేంకట స్వామినాయుడుకు అభినందనలు.

కాకినాడ　　　　　　　　డా॥ వావిలాల గోపాలకృష్ణయ్య

18-2-'91

# అభినందన

'కృష్ణాపత్రిక' అనగానే ముట్నూరి కృష్ణారావుగారి ఆజానుబాహుమూర్తి ప్రత్యక్షమవుతుంది ముట్నూరి అనగానే కృష్ణాపత్రిక అక్షరాలా సాక్షాత్కరిస్తుంది. అంతటి అవినాభావ సారూప్యం ఆ ఉభయశక్తులది.

తొలినాళ్ళలో తెలుగునాట ఉదయించిన ప్రముఖ పత్రికల్లో కృష్ణాపత్రిక గణనీయమైంది. రాజకీయ, సాంస్కృతిక, భాషా సాహిత్య రంగాల్లో కృష్ణాపత్రిక అద్వితీయ కృషి చేసింది. ముట్నూరి వారి కరస్పర్శతో అది కడాని ముద్దగా రూపొందింది

శ్రీ సాదనాల కృష్ణాపత్రిక చేసిన సాహిత్యసేవ గురించి ఎం. ఫిల్. పట్టానికి సిద్ధాంత వ్యాసం రచించాడు. ఒకే పత్రికపై జరిగిన పరిశోధనల్లో ఇదే ప్రథమమని చెప్పవచ్చు. కృష్ణాపత్రిక అవతరణ వికాసాదులను గురించి వివరించడమే కాకుండా కృష్ణారావుగారి బహుముఖీన ప్రజ్ఞను గూర్చి విశ్లేషించి చెప్పడం సముచితంగావుంది.

కృష్ణాపత్రిక చేసిన భాషా సాహిత్యసేవను ఆయా ప్రక్రియలపరంగా వింగడించి చూపడం ఈ గ్రంథానికే విశిష్టత సంతరించిన అంశం.

ఒక చక్కని పరిశోధన గ్రంథాన్ని మంచి వచనశైలిలో రచించిన సాదనాల వేంకట స్వామి నాయుడుకు నా హార్దిక అభినందన.

హైదరాబాద్
24-11-'93

—ఆచార్య సి. నారాయణరెడ్డి

# అభినందన

మిత్రుడు శ్రీ సాదనాల వేంకట స్వామి నాయుడు ఎం.ఫిల్. పరిశోధన సిద్ధాంత వ్యాసం 'కృష్ణాపత్రిక సాహిత్యసేవ' చూసినాను. ఇరవయ్యో శతాబ్దం తొలిరోజుల్లో తెలుగు సాహిత్యాన్ని పరిపోషించి ఎనలేని సేవచేసిన పత్రికల్లో కృష్ణాపత్రిక అగ్రశ్రేణిలోకి వస్తుంది. ముఖ్యంగా ఆ పత్రిక సంపాదకుడు ముట్నూరి కృష్ణారావుగారు గొప్ప సాహిత్యాభినివేశం కలిగినవారు. తెలుగు పత్రికా రంగం రచన పరంగా, సాంకేతిక పరంగా, వైజ్ఞానికపరంగా శాఖోపశాఖలుగా విస్తరించింది. అందుకు కృష్ణాపత్రిక వేసిన బాట అందరికీ మార్గదర్శకమైంది. దాని సంపాదకులు శ్రీ ముట్నూరివారి సేవ అమోఘమైంది. ఆనాడు మచిలీపట్నం నుంచి సరస్వతి వలె ప్రవహించి ప్రకాశించిన త్రిమూర్తులు శ్రీ కోపల్లె హనుమంతరావు, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగార్లు. ముట్నూరి వారిని తెలుగు జర్నలిజంలో ఒక విజ్ఞాన ఖనిగా అభివర్ణించారు ప్రఖ్యాత పాత్రికేయుడు శ్రీ ఖాసా సుబ్బారావు. 1902లో ప్రారంభించి 1945 వరకు దాదాపు 45 ఏళ్ళు సుదీర్ఘకాలం తెలుగు సాహిత్యంలో వర్ధిల్లిన పద్య, గేయ, వచన, కథ, నాటక, నవల, వ్యాస, విమర్శాది ప్రక్రియల్ని విస్తృతంగా ప్రచురించి ప్రోత్సహించి పోషించిన పత్రిక కృష్ణాపత్రిక. అలాంటి పత్రిక సాహిత్యానికి చేసిన సేవ వర్తమానానికి. భవిష్యత్తరానికి తెలియజేయడం ఎంతయినా అవసరం. అలనాటి గేయాలు, పద్యాలు, కవితలు కథలు, నాటికాలు, సమీక్షలు, సంపాదకీయాలు కృష్ణాపత్రిక ఏయే సంచికల్లో చోటుచేసుకున్నదీ సమస్త వివరాలతో ఈ గ్రంథంలో రచయిత పేర్కొనినాడు. ఈ సందర్భంలో రచయిత శ్రీ సాదనాల వేంకటస్వామినాయుడును అభినందిస్తున్నాను.

హైదరాబాద్
20-1-1994

— ఆచార్య పేర్వారం జగన్నాథం

# అభిప్రాయం

ప్రపంచంలో పత్రికల స్థానం పవిత్రమైంది. జాతి జాగృతికి పత్రికలు ఎంతో తోడ్పడతాయి. జాతీయోద్యమంలో పత్రికల పాత్ర పలువురు ఎరిగిందే అంత ప్రాముఖ్యాన్ని సంతరించుకున్న పత్రికల మీద పరిశోధనలు జరగవలసిన అవసరం ఉంది. ఆ అవసరాన్ని గుర్తించినవాడు శ్రీ సాదనాల.

శ్రీ సాదనాల వేంకట స్వామినాయుడు నా శిష్యుడైనందుకు నా కెంతో సంతోషం. సంగీత, సాహిత్యాది కళల్లో యితనిది ఒక ప్రత్యేకమయిన బాణి ఇతను కృష్ణాపత్రికమీద ఎం. ఫిల్. చేయడం సాహసం. అసలు కృష్ణాపత్రికలో సాహిత్యాంశాలు ఉంటాయా ? అని అన్నవాళ్ళు లేకపోలేదు. అయితే కృష్ణాపత్రికల్ని సంపాదించిన తర్వాత తెలిసింది అందులోని అసలు విషయం. ఒక్కొక్క అంశంమీద ఒక్కొక్క పిహెచ్. డి. చేయవచ్చు. పాటలు, పద్యాలు, కథలు, కథానికలు, నాటకాలు, నవలలు, వ్యాసాలు, విమర్శలు, సంపాదకీయాలు, గ్రంథ సమీక్షలు, స్వీయ జీవిత చరిత్రలు, పేరడీలు ఒకదేమిటి కృష్ణాపత్రికలో లేని అంశమేలేదు ఇంతటి సాహిత్యసేవ చేసిన పత్రిక మీద యిప్పటిదాకా పరిశోధన జరగకపోవడం సాదనాల కోసమే అనుకుంటాను ఎందుకంటే, వేరే వాళ్ళు చేస్తే పత్రికకు అన్యాయం జరిగేదేమో ! అందుకే, ఈ ఎం ఫిల్., సిద్ధాంత వ్యాసం తెలుగు విశ్వవిద్యాలయం మొట్టమొదటి స్నాతకోత్సవంలో ఉత్తమమైన పరిశోధనగా బంగారు పతకాన్ని పొందింది.

కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వ కాలంలో చేసిన సాహిత్య సేవను తెలుగు పాఠకలోకానికి అందించడానికి సాదనాల చేసిన ప్రయత్నం ప్రశంసనీయం.

శ్రీ సాదనాల ప్రస్తుతం నావద్ద కృష్ణాపత్రిక సాహిత్యాంశాలమీద పిహెచ్.డి.కై పరిశోధన చేస్తున్నాడు. ఈ పరిశోధన కూడా ఇతనికి మంచి పేరు సంపాదించి పెడుతుంది. కృష్ణాపత్రిక రిఫరెన్సులు కావాలంటే శ్రీ సాదనాలను సంప్రదించవచ్చును. ఎంతో శ్రమకోర్చి, ధనాన్ని వెచ్చించి సంపాదించిన కృష్ణాపత్రిక ఫొటోస్టాట్ కాపీలను భద్రపరచిన విధానం ప్రతి ఒక్కరిని ముగ్ధుల్ని చేస్తుంది. అదీ నిజాయితీగల పరిశోధన. ఇటువంటి ఈ పరిశోధన పాఠక లోకానికి ఒక ఆమెత.

—ఆచార్య కడప రమణయ్య

రాజమండ్రి
30-1-'94

# ఉపక్రమణిక

భారత జాతిని జాగృతం చేసేందుకు, జాతీయోద్యమానికి చేయూతనిచ్చి, భారతీయుల్లో దేశభక్తిని పెంపొందించేందుకు, సాంఘిక దురాచారాలపై ధ్వజమెత్తి ఖండించేందుకు, పందొమ్మిదవ శతాబ్దాంతంలో దేశంలో అనేక పత్రికలు ప్రారంభమయ్యాయి. ఆ కాలంలోనే తెలుగునేలలో వెలుగు పందిళ్ళుగా కొన్ని పత్రికలు వెలిసాయి వాటిలో ప్రముఖంగా పేర్కొనదగిన పత్రిక కృష్ణాపత్రిక.

బహుముఖ ప్రజ్ఞాశాలి ముట్నూరి కృష్ణారావు సంపాదకుడుగా ఈ పత్రిక తెలుగు ప్రజానీకానికి రాజకీయ రంగానే గాక, సాహిత్యపరంగా కూడా ఎంతో స్ఫూర్తినిచ్చింది.

గతంలో ముట్నూరి మీదనే పరిశోధనలు జరిగాయి. కానీ కృష్ణాపత్రిక చేసిన సాహిత్యసేవమీద ప్రత్యేక పరిశోధన జరగలేదు. కాబట్టి కృష్ణాపత్రికలో వెలువడిన సాహిత్యాన్ని కూడా ప్రత్యేకంగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది అందుచేత ఈ పరిశోధనాంశాన్ని స్వీకరించాను.

ఈ పరిశోధనాంశాన్ని నాలుగు ప్రకరణాలుగా విభజించి పరిశీలించడం జరిగింది.

"తెలుగు పత్రికల ఆవిర్భావం – పరిణామం" అనే ఒకటో ప్రకరణంలో తెలుగు పత్రికల ఆవిర్భావాన్ని, పరిణామ క్రమాన్ని వివరించాను.

రెండో ప్రకరణమైన "కృష్ణాపత్రిక అవతరణ – వికాసం" అనే దానిలో కృష్ణాపత్రిక ఆవిర్భావాన్ని, వికాసాన్ని, స్వరూపాన్ని చర్చించాను.

"ముట్నూరి కృష్ణారావు జీవితం – వ్యక్తిత్వం" అనే మూడో ప్రకరణంలో ముట్నూరి జననం, విద్యాభ్యాసంతోపాటు, కృష్ణాపత్రికసంపాదకుడుగా, రచయితగా సౌందర్యోపాసకుడుగా, దర్బారు నిర్వాహకుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా ఆయన సమాజానికి చేసిన సేవను పరిశీలించాను.

నాలుగో ప్రకరణమైన 'కృష్ణాపత్రిక - సాహిత్యం' అనే దానిలో కృష్ణా పత్రికలో ప్రకటితాలైన గేయాలు, పద్యాలు, కవితలు, పేరడీలు, కథలు, కథానికలు నాటకాలు, ఏకాంకికలు, నవలలు, వ్యాసాలు, సంపాదకీయాలు, గ్రంథ సమీక్షలు, విమర్శలు, ప్రతివిమర్శలు మొదలైన విషయాల ప్రస్తావన వుంది.

ముట్నూరి కృష్ణారావు సంపాదకత్వ కాలంలో వెలువడిన పత్రికల్లో ఉపలబ్ధమైనవాటి పరిశీలనే ఈ సిద్ధాంత వ్యాసంలో జరిగింది. కృష్ణాపత్రికలోని సాహిత్యాంశాల్ని చర్చించకుండా, పత్రికల్లో ప్రకటితమైన అంశాలను మాత్రమే యిందులో ఉట్టంకించాను.

ఒకే పత్రికపై పరిశోధనకు శ్రీకారం చుట్టిన ఈ పరిశోధన పరిశోధకులకు ఉపకరిస్తుందనీ, ఇతర పత్రికలపై పరిశోధన చేయడానికి స్ఫూర్తినిస్తుందనీ ఆశిస్తున్నాను.

—రచయిత

# కృతజ్ఞతలు


'కృష్ణాపత్రిక సాహిత్యసేవ - ఒక పరిశీలన' అనే అంశంపై పరిశోధనకు అవకాశం కల్పించి, నాకు అభినందన లంద జేసిన అప్పటి తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు, భారతీయ మహాకవి, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి గారికీ...

అనారోగ్యంతో ఉన్నా, అడగగానే 'రెండు మంచిమాటలు' రాసిన సుప్రసిద్ధ కవి, పరిశోధకులు డా॥ ఆరుద్రగారికీ...

నాపై వాత్సల్యంతో 'ఒక మాట' రాసిన ప్రముఖ గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులు డా॥ వావిలాల గోపాలకృష్ణయ్యగారికీ...

నా మీద ప్రేమతో 'అభినందన' లందజేసిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికీ...

నా మీద అవ్యాజానురాగాన్ని కురిపిస్తూ,నా పరిశోధనను సుసంపన్నం చేసిన మద్గురువరేణ్యులు తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్య పీఠాధిపతి ఆచార్య సి. రమణయ్యగారికీ...

నా యీ ప్రయత్నానికి సర్వదా వెన్నుతట్టి, ఉత్సాహపరిచి, ప్రోత్సహించిన అధ్యాపక వర్గం ఆచార్య ఆర్. వి. ఎస్. సుందరంగారికీ, డా॥ పొన్నా లీలావతమ్మ గారికీ, డా॥ జయధీర్ తిరుమలరావుగారికీ...

నాకు కావలసిన సమాచారమందించి,పుస్తకాలను ఇచ్చిన మిత్రుడు ముదిగొండ నాగేశ్వరరావుగారికీ, కంచి వాసుదేవరావుగారికీ, ఎం దత్తాత్రేయశర్మగారికీ...

సౌజన్య మూర్తులు, శ్రేయోభిలాషులు కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణగారికీ సన్నిధానం నరసింహశర్మగారికీ...

నాతోపాటు అహర్నిశలూ శ్రమించి, శుద్ధ ప్రతినిర్మాణానికి ఎంతగానో సహకరించిన ప్రియ మిత్రులు డా॥ డి. వి. శ్రవణ్‌కుమార్, చింతా బుజ్జిలకూ...

నా పరిశోధనకు అవసరమైన కృష్ణాపత్రికలను శిథిలావస్థలో ఉన్నా పరిశీలించడానికి అనుమతించి, నా పరిశోధనను సుగమం చేసి ఫలవంతం గావించిన సహృదయులు, తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయాధిపతులు యం. శంకరరెడ్డి గారికీ, వారి సిబ్బందికీ...

సాహిత్య పీఠం గ్రంథాలయ సిబ్బందికీ...

వేటపాలెం సరస్వతీ నికేతన భాండాగార నిర్వాహకులు కె. సుబ్రహ్మణ్యం గారికీ, వారి సిబ్బందికీ...

రాజమండ్రి గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయాధికారి ఏసుదాసుగారికీ, రెడ్డి, కుమార్, ప్రసాద్, సుబ్రహ్మణ్యంగార్లకూ...

తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠంలోని బోధనేతర సిబ్బందికీ...

పత్రికల కేటలాగింగ్‌లో సహకరించిన మిత్రులు డా॥ సి. యస్వీ. అచ్యుత శర్మ, ఎం. కె. అబ్బాసు, వక్కలంటి శ్రీనివాసరావు, బి. జగన్నాథ్, పి. శ్రీనివాసరావు, పవన్, బాణాల రమేష్, కర్రోతు తిరుపతిరావు, సలీంలకూ, చెల్లి లక్ష్మికీ మరదలు జ్యోతికీ...

నన్ను ఈ ప్రపంచానికి పరిచయం చేసిన నా తల్లిదండ్రులు డా॥ సాదనాల బాలకృష్ణారావు శ్రీమతి సత్యవతీగార్లకూ...

నా అర్ధాంగి డా॥ మాధురికీ...

ముఖపత్ర కల్పన చేసిన సుప్రసిద్ధ చిత్రకారులు,కవి శీలా వీర్రాజుగారికీ...

ముఖపత్రం అచ్చువేసిన శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్ వారికీ...

లోపలి పేజీలు అచ్చువేసిన మహేశ్వరి ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్ రాజమండ్రివారికీ...

ఎందరో శ్రేయోభిలాషులు - అందరికీ...

......కృతజ్ఞతలు

డా॥ సాదనాల వేంకట స్వామి నాయుడు

# ప్రధాన సంకేత వివరణ

| | | |
|---|---|---|
| అ. | అక్టోబరు | 1. |
| అను. | అనువాదము | |
| అ. రూ. | అభినయము-రూపకము | |
| అసం. | అసంపూర్ణం | |
| ఆ. | ఆగస్టు | |
| ఆ. ప్ర. | ఆకాశవాణి ప్రసంగము | |
| ఏ. | ఏప్రెల్ | |
| క. క. | కల్పనా కథలు | |
| కా. శా. | కావ్యమీమాంస-శాస్త్రవిచారము | |
| గీ. మా. | గీతమాలికలు | |
| చి. మా. | చిత్రమాలికలు | |
| జ. | జనవరి | |
| జు. | జులై | |
| జూ. | జూన్ | 2. |
| డి. | డిసెంబరు | |
| న. | నవంబరు | |
| న. భా. | నవ్య భావోదయం | |
| ప్రచు. | ప్రచురణకర్తలు | |
| పు. | పుటలు | |
| ఫి. | ఫిబ్రవరి | |
| బాలా | బాలానందం | |
| మా. | మార్చి | 3, |
| ర. మ. | రసమంజరి | |
| వ. క. | వచన కవిత | |
| సమీ. | సమీక్షకుడు | |
| స్వా. ర. | స్వాతంత్ర్య రథం | |
| సూ.చె.క. | సూర్యం చెప్పిన కథలు | |
| సె. | సెప్టెంబరు | |

# విషయసూచిక

# 1

# తెలుగు పత్రికల ఆవిర్భావం-పరిణామం

'పత్రిక' అనే పేరు మొదట వ్యవహారకాండకే పరిమితం. వ్యక్తుల మధ్య క్రయవిక్రయాల ఒప్పందం మొదలైనవి రాతపూర్వకంగా భద్రపరచుకోడానికే యిది వ్యవహృతం. ఆ తర్వాత రాతపూర్వకంగా పరస్పరం తెలుసుకొనే విషయానికికూడా ఈ పారిభాషిక పదం ఉపయోగంలోకి వచ్చింది. రాతకోతలకు మొదట భూర్జపత్రాలు, తాటాకులు మాత్రమే ఉపయోగంలో ఉండేవి. అందుకనే వేటిమీద రాస్తారో వాటిని పత్రికలుగానే భావించారు. ఓడియాకులు, విడాకులు మొదలైన పద బంధాలనుబట్టి కూడా ఆకులపైననే మొదట్లో రాతలు జరిగేవని అర్థమవుతుంది. పత్రిక అనే పేరు వార్తాపత్రికకు 'పత్రం'నుంచి ఈవిధంగా రూఢమై వుంటుందనవచ్చు.

శబ్దరత్నాకర నిఘంటువులో పత్రికకు 'వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడు పత్రము' అని అర్థం వుంది. 'పత్రం'అనే ఆరోపం దగ్గర 'వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడు ఆకు' అని అర్థం వుంది. సూర్యరాయాంధ్ర నిఘంటువులోకూడా 'పత్రిక' అంటే 'వ్రాంతకాధారమగు తాటియాకు, కాగితము, వ్యవహారమున పరస్పరము వ్రాసికొనెడు పత్రము' అని మాత్రమే చెప్పబడివుంది.

తెలుగుసాహిత్యంలో పింగళి సూరన రచించిన 'ప్రభావతీ ప్రద్యుమ్నం'లో మొదటిసారిగా 'పత్రికా' పద ప్రసక్తి కనబడుతోంది. వజ్రపురానికి బయలుదేరి వెళుతున్న చిలుకతో తన పత్రికను ప్రభావతికి అందియ్యమని ప్రద్యుమ్నుడు చిలుకను ప్రార్థించే సందర్భంలో ఈ ప్రస్తావన వుంది.

సీ. "ఓ పక్షివర ! విను, మా పురి శుచిముఖి
యను పేరి యొక రాజహంసి యుండు,
నది యున్నచోటు నీ వరసి, యీ పత్త్రిక
యందింపవలయు మత్ప్రార్థనమున..."[1]

---

1. సూరన, పింగళి - ప్రభావతీ ప్రద్యుమ్నం - తృతీయాశ్వాసం, పద్యం-32.

ఔత్తరాహులు పత్రికారచయితను 'పత్రకార్' అన్నారు. మొత్తానికి 'పత్రం' నుంచే పత్రిక ఉద్భవించిందని చెప్పవచ్చు.

కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి సంపాదకత్వంలో వెలువడిన "ఆంధ్రభాషా సంజీవనీ పత్రికలో పత్రిక ఎలా ఉండాలి? సంపాదకుడు, విలేఖకుడు, చందాదారు, పాఠకుడు ఎలాటివారు? అనే వాటికి కొన్ని నిర్వచనాలున్నాయి.

## పత్రికా లక్షణము :-

సీ. పత్రముద్రా సౌష్ఠవంబు, సద్భాషయు,
ధర్మనీతి న్యాయ తత్త్వదమగు
వ్యాసము, స్వాశయ వార్తాళి, వివిధ వా
ర్తల కల్మి, కృతి విమర్శన, ముదార
సల్లేఖ కోషంబు, శాస్త్ర సదాచార
సిద్ధాంత, మర్థ సంసిద్ధి కృత్య,
మనెడు నీ నవ లక్షణావళి దేనియం
దిరవొందు సుగుణంబు వరమణి యన

తే.గీ. నద్ది వృత్తాంత పత్రికయౌ సలక్ష
ణం, బిటులు గాని దవలక్షణ ప్రవృత్తి
పత్రిక యని యనంబడుంబడు నిజముగ౯
గుగుణమౌమణి విబుధులు గోరి కొంద్రె.

కాకితాల ముద్రణపు బాగు, మంచి భాష, ధర్మం, నీతి, న్యాయతత్త్వ ప్రతిపాదకమైన వ్యాసం, తన ఆశయానికి సంబంధించిన వార్తల సమూహం, రకరకాల వార్తలుండటం, కావ్యవిమర్శ, మంచి లేఖల సమూహం, శాస్త్రాలలోని మంచి ఆచారాలు, అర్థలాభం కోసమైన కార్యం అనే తొమ్మిది లక్షణాలు దేనియం దుంటాయో అది సలక్షణమైన వృత్తాంత పత్రిక. అలా లేనిది అవలక్షణ పత్రిక అనిపించుకుంటుంది. గుణవంతంకాని మణిని పండితులు కోరుకుంటారా? కోరుకోరని భావం.

విలేఖక లక్షణము :-

సీ. పండితుండును, సత్ప్రవర్తకుండును జగ
ద్వ్యాపారవిజ్ఞుండు స్థైర్యయుతుఁడు
ధైర్య సంపన్నుండు ధని యుచితజ్ఞుండు
శక్తి త్రయాఢ్యుండు, సూక్తి చతురుఁ
డను పదంబులె బిరుదాభి ధానంబులు
బిరుదాభరణములై వెలయు మిగుల
నీ విశేషణమణుల్ భావింపఁబడు నవ
లక్షణము లివే విలక్షణములు

తే గీ. గాన నిటు నవలక్షణ కలితుఁడైన
వాఁడు నవరత్నహార సంభావనీయుఁ
డవు విలేఖకుఁడిటు గామి నౌనె యొరుఁడు ?
వానివలెఁ గాక, కుముఖుండయౌ నిజముగ.

పండితుడు, సత్ప్రవర్తకుడు, లోకజ్ఞుడు, స్థైర్యవంతుడు, ధైర్యవంతుడు, ధనవంతుడు, ఉచితజ్ఞుడు, శక్తిత్రయ సంపన్నుడు, సూక్తిచతురుడు అనే పదాలే బిరుదులు. ఈ విశేషణాలనే మణులే విలక్షణాలైన నవలక్షణాలు. ఈ నవలక్షణాలు గలవాడు నవరత్నహారంతో సంభావింపదగిన విలేఖకుడవుతాడు. అలా గానివాడు కుముఖుడనబడతాడు.

ఉపవిలేఖక లక్షణము :-

సీ. ఆదినే లేఖనీయాంశంబు సత్యంబు
స్వప్రమాణంబుగా జనుసెఱుంగ
సంగ్రహముగ వ్రాయసమకట్టవలయు నం
తట వ్రాఁత దగు విశదముగ నుండ,
విషయ విన్యాసంబు విస్పష్టముగ నుండ
వలయు సందర్భార్థములుఁ గ్రమముగ

నొప్పునాడఁగఁ గూడ దెవ్వరి నేనియు
దబ్బఱ పొగడికల్ దగవు వ్రాయ.

తే గీ. వాస్తవంబైన వార్తనే వలయుఁ దెలుప
స్వీయనామ నివాసముల్ వివరముగను
దెలియ లిఖింపవలయు; నిట్లలరు నుప వి
లేఖకుని లక్షణములు; పోలెడు మణులను.

మొదటనే లేఖనీయాంశాన్ని సత్యప్రమాణంగా తెలుసుకోవాలి. దానిని సంగ్రహంగా రాయాలి. తరువాత ఆ రాసిన రాత సుస్పష్టంగా ఉండాలి. అందులోని విషయ విన్యాసం విశదంగా ఉండాలి. సందర్భం, అర్థం సక్రమంగా ఉండాలి. ఎవరినీ నొప్పించేటట్టు ఉండగూడదు. అబద్ధపు పొగడ్తలు తగవు. వాస్తవమైన వార్తనే రాయాలి. తన పేరు, విలాసం, వివరంగా తెలపాలి. ఇట్లా ఉండే ఉపవిలేఖకుడి లక్షణాలు మణుల్ని పోలి ఉంటాయి.

## స్వీకర్తృ లక్షణము :-

సీ. ఈయందగిన డబ్బు నీవలె ముందుగాఁ;
బత్రికఁ గ్రమముగాఁ బడయవలయు
నందకున్నను దెల్పి, యందుకోవలయును;
దాని నెఱుంగఁగఁ దగును మగియఁ;
దత్పత్రికల నొగిఁ దగ నుంచుకొనవలెఁ;
బొత్తంబుగా నేని పొత్తిగానొ;
యొసఁగరా దొరులకు నొసఁగిన జ్ఞప్తితోఁ
గైకొవ వలయును బైకమువలెఁ;

తే.గీ. బెడక యుండంగ నప్పప్పు కడఁక తోడఁ
వానిఁ బరికింపవలయును; వలయుఁ జదువ;
నివ్వి నవలక్షణములవు నెలమిఁ బత్రి
కలను గొనియెడి సత్పురుషుల కరయఁగ.

ఇవ్వదగిన సొమ్ము ముందుగానే ఇవ్వాలి. తరువాత క్రమంగా పత్రికని పొందాలి. పత్రిక అందకపోతే చెప్పి తెప్పించుకోవాలి. ఆ పత్రికల్ని ఒక పుస్తకంగా గాని, ఒక కట్టగాగాని ఉంచుకోవాలి. ఇతరులకు ఇవ్వగూడదు. ఒకవేళ ఇస్తే మరిచి పోకుండా డబ్బు ఎలా తీసుకుంటామో అలా తీసుకోవాలి. అప్పుడప్పుడు అవి చెడి పోకుండా చూసుకోవాలి. చదువుతూండాలి. పత్రికలు కొనే సత్పురుషుల నవలక్షణాలు ఇవే.

పాఠకుల లక్షణము :-

సీ. పత్రిక చెడకుండఁ బైకప్పు నెడలింప
వలయును; విప్పంగ వలయునట్లె;
తొల్దొల్త శీర్షికల్ దొడరి చూడన్వలె;
స్వవిషయముల ముందు చదువఁగ వలె
నంతటఁ దనవారి పైన విషయములఁ
బరికింపవలె; నంతఁ బర విషయము
లరయంగవలయు నేకాగ్రమనస్కుఁడై;
మడత మార్పఁగరాదు; ముడుతలు పడ

తే.గీ. నీక, నలఁగనీక, యెప్పటి యట్లె తం
డుంచి దానినట్లె యొప్పు నతఁడు
స నవలక్షణుండు సత్పాఠకుం డిట్లుఁ
గొఱలకున్నఁ బాఠకుం డెటులగు ?

పత్రిక చెడకుండా పై అట్ట తొలగించాలి. అలాగే విప్పాలి. మొదట శీర్షికలు చూడాలి. ముందుగా తన విషయాల్ని చదవాలి. తరవాత తనవాళ్ళ విషయాలు పరికించాలి. ఆ తరవాత ఏకాగ్రచిత్తంతో పరవిషయాలు చూడాలి. మడత మార్చ గూడదు. ముడతలు పడనీయగూడదు. నలగకుండా ఎప్పటిలా ఎవడు దానిని ఉంచుతాడో, వాడే నవలక్షణుడైన సత్పాఠకుడు. అలా ఉండనివాడు సత్పాఠకుడెట్లా అవుతాడు ?

ఈ పద్యాలు మాత్రం శ్రీమద్వర్తమాన తరంగిణి[మాసపత్రిక, 1896 ఏప్రిల్, సంచిక-1, సంపుటము-2, పుటలు 6,7. ప్రచురణకర్త : బెజవాడ బాలకృష్ణారెడ్డి] నుంచి స్వీకరించబడ్డాయి.

ఈ పద్యాల గురించి వర్తమానతరంగిణిలో 'వార్తాపత్రికాలక్షణ ప్రశంస' శీర్షికలో ఎడవల్లి కామయ్య(Y.K.) [శ్రీమద్వర్తమాన తరంగిణి పత్రిక కార్యదర్శి] ఈ విధంగా పేర్కొన్నారు.

> 'నిర్వచన వచన చంపూనాటక శతకాదుల కెందరెందరో లాక్షణికులిదివఱకు లక్షణములం జెక్కించిరి వ్రాసిరిగాని, పత్రికాలక్షణ మిదివఱకు సూత్రప్రాయ ముగ నైన నెవరును నొక్కింతేని లక్షణము నేలాక్షణికుండును నుడుపడయ్యె ఇట్లుండ మొన్నటి ఫాల్గున మాసాంధ్ర సంజీవనియందుఁ దదధిపతులయిన బ్రి॥మ॥ కొక్కొండ వేంకటరత్నం పంతులు వారైదు సీసములచే సంక్షేప రూపంబున పత్రికా లక్షణము నుడివిరి. కొందఱధిక ప్రసంగులు "పత్రికా లక్షణమిదిగాదు, ఈ యంశములు పత్రికలయందుండ జనదు; పత్రిక యన నిద్దియా ? ఇదియు నొక్క పత్రికయేనా ?" అని, యీ రీతి నిచ్చవచ్చి నట్లెల్ల విచ్చలవిడిం బ్రేలుచుఁ, దాము లాక్షణికులవలె నటించుచున్నారు. తక్కిన ప్రబంధాదులకుం బలె దీనికిని పండితాదరణీయముగ లక్షణ గ్రంథ మొకటి యున్న వీరిట్లు ప్రేలుదురా? పత్రికాధిపతులు కొందరు తమ కిష్టము వచ్చినట్లు నీతి నిషిద్ధములు లేక, యేదుర్విషయములనేని తమతమ పత్రికా ముఖంబునం బ్రకటింతురా ? గాన నట్టివారికి వాగ్బంధనంబును, నిట్టివారికిఁ బాణి బంధనంబును, నగునటులనె సలికమీద నీ విషయమై మఱియొక విపుల తరమగు వ్యాసమును వ్రాయ వీరిని, ప్రకృతముండెడి పత్రికాధిపతులలోఁ బాండిత్యబలమునం బ్రాముఖ్యతఁ గన్నవారు వీరెయై యుంటంజేసి, మనో వైషమ్యంబులు మాని, తదుచిత పత్రికా లక్షణంబు సులక్షణంబుగఁజేకొని, తద్విధంబాచరించుటకై తక్కిన పత్రికాధిపతులను, వేడుచు, సంక్షేప పత్రికాలక్షణరూపములైన యీ పంచరత్నములను వ్యాప్తి నిమిత్తమిందుఁ బ్రకటించుచున్నారము."

"కొక్కొండవారి భావంలో విలేఖకుడంటే సంపాదకుడు; ఉపవిలేఖకుడంటే ఉపసంపాదకుడో లేక రిపోర్టరో; స్వీకర్త చందాదారు; పాఠకుడంటే చదువరి."[1]

క్రీ॥శ॥ 1556 నాటికే భారతదేశంలో పుస్తకముద్రణ ప్రారంభమైంది. 1746 లో తెలుగులో పుస్తకాలు అచ్చయ్యాయి. జర్మనీలోని 'హాలీ' నగరంలో తెలుగు పుస్తక ముద్రణ ప్రారంభమైంది. తెలుగులో 1830 తర్వాతనే అచ్చుపుస్తకాల ప్రాచుర్యం, పత్రికల ఆవిర్భావం కూడా జరిగిందని చెప్పవచ్చు.

# తెలుగు పత్రికల ఆవిర్భావం :

ఆంధ్రదేశీయులు సాంఘికచైతన్యానికీ, ఆంధ్రవాఙ్మయ వైవిధ్యానికీ తెలుగు పత్రికలు చేసిన కృషి మహత్తరమైంది. తెలుగు వచన రచనాభ్యుదయానికీ, భాషా వికాసానికీ తెలుగుపత్రికలు ఎనలేని సేవ చేశాయి.

"పత్రికల ఆవిర్భావంతోనే మన దేశంలో ఆధునిక యుగం ప్రారంభమైందని చెప్పటంలో అతిశయోక్తిలేదు. ఆధునిక భావవ్యాప్తికి పత్రికలు సాధనాలయ్యాయి. ఈ కాలంలోనే భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం, సంఘసంస్కరణోద్యమంలాంటివి ప్రారంభమయ్యాయి. మరోవైపు జాతీయచైతన్యం రెమ్మలు సాచింది. వీటి వ్యాప్తికికూడా పత్రికలు వేదికలయ్యాయి. ప్రారంభంలో ఈ ఉద్యమాలన్నీ వంగదేశంలో మొగ్గలు తొడిగాయి. అక్కడనుంచి యితర ప్రదేశాలకు వ్యాపించాయి. కాబట్టే భారతదేశంతో వంగభూమిలోనే పత్రికలు ప్రారంభమయ్యాయి. తెలుగులో పత్రికా ప్రచురణ ప్రారంభం కావడానికి ఆ పత్రికారంగం పూర్వరంగంగా పని చేసింది"[2] అని డా॥ లక్ష్మణరెడ్డి రాశారు.

1. రామచంద్ర, తిరుమల-తెలుగు పత్రికల సాహిత్యసేవ, పుటలు. 16,17,18, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, హైదరాబాద్, ప్రథమ ముద్రణ : జనవరి 1989.
2. లక్ష్మణరెడ్డి వి. డా॥ - తెలుగు జర్నలిజం - అవతరణ - వికాసం - పుటలు 13, 14, ప్రథమ ముద్రణ : జనవరి 1985.

తెలుగులో వార్తాపత్రిక సంప్రదాయం 16వ శతాబ్ది ఉత్తరార్ధం చివరనే మొదలైందనీ, తొలి తెలుగు వార్తాపత్రిక ఉద్భవించిందని చెప్పవచ్చు. అది 'రాయ వాచకం.' దీని రచయిత కాశీవిశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి. ఇది "కాశీవిశ్వ నాథనాయనయ్యవారి తరపున విజయనగరంలోఉన్న స్థానాపతి పంపిన విన్నపం లేక రిపోర్ట్."[1] ఇలాంటిదే కన్నడంలో 'రామరాజనబైఖరు.' కానీ యివి నేటి వార్తా పత్రికలవంటివి కావు.

తెలుగులో ఆధునిక సాహిత్య ప్రక్రియ అయిన కథ, నవల, వ్యాసం లాగా పత్రికారచనకూడా పాశ్చాత్య ప్రభావంతో వెలిసింది. ఈవిధంగా—

> "భారతదేశంలో మొట్టమొదట ఆవిర్భవించిన పత్రిక 'దిగ్దర్శన్' (1918) వంగరాష్ట్రం శ్రీరాంపూర్, సంపాదకుడు-మార్ష్‌మేన్. ఆ తర్వాత 14 సంవత్సరాలకుగాని తెలుగులో పత్రిక రాలేదు. తెలుగులో మొదటి పత్రిక 'కర్ణాటక క్రానికల్' అని, ఇది మద్రాసునుంచి వెలువడిందని డా॥ జి. యన్. రెడ్డి చెప్పారు."[2]

తెలుగు పత్రిక తొలిసారిగా 1832 లో ప్రచురితమైందనీ, ఆ తర్వాత 1835 లో 'సత్యదూత' అనే పత్రిక వెలువడిందనీ, దీనిని బళ్లారి క్రైస్తవ సంఘం వెలువరించిందనీ తెలుస్తుంది. కానీ ఈ విషయాన్ని కొందరు అంగీకరించడంలేదు. 'వృత్తాంతిని' అనే తెలుగు పత్రిక (1838-41) తొలినాళ్ళ తెలుగుపత్రిక అని చెప్పవచ్చు. ఇది మద్రాసునుండి వెలువడేది. తర్వాత 'తరంగిణి' పత్రిక (1842-1850) వరకు వెలువడింది. పువ్వాడ వెంకటరావు దీని సంపాదకుడు. 'హితవాది' అనే పత్రిక 1845 లో బందరునుండి వెలువడింది. మాసపత్రికగా వెలువడిన దానికి సంపాదకుడు-ఫారర్ జె. ఎడ్మండ్‌షాల్కీ. ఇది మధ్యలో ఆగిపోయి మళ్ళీ 1862 లో పునరుజ్జీవం పొంది కొంతకాలం నడిచినట్లు తెలుస్తోంది. కాకినాడనుండి 'రవి' అనే వారపత్రిక వెలువడింది. 'సుజనరంజని' అనే పత్రిక (1862-67) లో వింజమూరి

---

1. రామచంద్రరావు సి. వి. డా॥ (సంపాదకుడు) - పీఠిక, పుట (iii) - రాయ వాచకము. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ప్రథమ ముద్రణ : 1982.
2. రామచంద్ర, తిరుమల - తెలుగు పత్రికల సాహిత్యసేవ, పుట 1, 2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, ప్రథమ ముద్రణ : జనవరి, 1989.

కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు, కారుమంచి సుబ్బరాయలు నాయుడుల సంపాదకత్వంలో మొదట మాసపత్రికగా వుండి, పిదప ద్వైమాసికంగా వెలువడింది.

'శ్రీయక్షిణి' అనే పత్రికను బళ్ళారినుంచి వేంకటరమణకవి, త్యాగరాజ మొదలియార్ అనేవాళ్లు వెలువరించారు. ఇది 1863-65 వరకు వెలువడింది. చెన్నపురి వేదసమాజంవారి యాజమాన్యంలో 1864-70 వరకు 'తత్త్వబోధిని' అనే పత్రిక నడిచింది. 'ఆంధ్రభాషా సంజీవని' అనేదాన్ని మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నంపంతులు ప్రారంభించారు. ఉమారంగనాయకులు సంపాదకత్వంలో బందరునుంచి 'పురుషార్థప్రదాయిని' అనే పత్రిక 1872 లో ప్రారంభమై దాదాపు 20 సంవత్సరాలు నడిచిందని విదితమౌతోంది.

పరవస్తు వేంకట రంగాచార్యుల సహకారంతో విశాఖపట్నంనుంచి 'సకల విద్యాభివర్ధని' (1872-79) అనే పత్రిక వెలువడేది. వీరేశలింగం 1874 అక్టోబరులో 'వివేకవర్ధని'ని ప్రారంభించాడు. ఇది ముందు మాసపత్రికగానూ, తర్వాత పక్షపత్రికగానూ, పిదప వారపత్రికగానూ నడిచింది. వీరేశలింగమే 'శ్రీచింతామణి' (1880, సంపాదకుడు : వావిలాల వాసుదేవశాస్త్రి), 'సతీహితబోధిని' (1883-86), 'సత్యవాది' అనే పత్రికలను ప్రారంభించాడు. రాయసం వేంకటశివుడితోపాటు 'జనానా' (1889) పత్రికను కొన్నాళ్లు వీరేశలింగం నడిపాడు. 'జనవినోదిని' (1875-85) అనే పత్రికను వి. కృష్ణమాచార్యులు నిర్వహించాడు. గురజాడ శ్రీరామమూర్తి సంపాదకుడుగా పెద్దాపురంనుంచి 'ప్రబంధ కల్పవల్లి' (1880-82) అనే పత్రిక వెలువడింది. 'యథార్థవాది' (1881-85) అనే పత్రిక గరుడ కూర్మయ్య సంపాదకత్వంలో విశాఖపట్నంనుంచి వెలువడింది. శ్రీకాకుళంజిల్లా జులుమూరునుండి భగతా తమ్మయ్యశాస్త్రి 'నీలదర్పణము' (1885-87) ను వెలువరించాడు.

ఈకాలంలోనే 'సుజనోల్లాసిని' అనే మాసపత్రిక ఏడునూతుల ముత్తయ్య సంపాదకత్వంలో వెలువడింది. మన్నవ బుచ్చయ్యపంతులు అనే సంఘసంస్కార ప్రియుడు మద్రాసునుండి 'హిందూజన సంస్కారిణి' (1885-1902; 1912-14) అనే పత్రిక నడిపాడు. నెల్లూరునుండి పూండ్ల రామకృష్ణయ్య సంపాదకత్వంలో 'అముద్రితగ్రంథ చింతామణి' (1885-1904) ప్రచురింపపడింది. నెల్లూరుమండలం

లోని బుచ్చిరెడ్డిపాలెంలోని శారదాస్థానం నుండి బెజవాడ బాలకృష్ణారెడ్డిచే 'శ్రీమద్వర్తమాన తరంగిణి' (1894-96) అనే మాసపత్రిక ప్రకటింపబడింది.

ప్రముఖ రాజకీయవేత్త అయిన పనప్పాకం అనంతాచార్యులు 'శ్రీవైజయంతి' (1894-99) అనే పత్రికను నడిపాడు. 'బాలిక' అనే తొలి తెలుగు మహిళా మాస పత్రిక సంగీతరావు బాపిరాజు సంపాదకత్వంలో 1895 ప్రాంతాన వెలువడింది. 'తెలుగు జనానా' (1893-1904; 1906) అనే పత్రికను మొదట మల్లాది వేంకట రత్నం ప్రారంభించాడు. తర్వాత దీన్ని రాయసం వేంకటశివుడు స్వీకరించి నిర్వహించాడు.

'శశిరేఖ' (1893-1900) అనే పత్రికను గట్టుపల్లి శేషాచార్యులు మదరాసు నుండి నడిపించాడు. ఎ. సి. పార్థసారథినాయుడు 'ఆంధ్ర ప్రకాశిక' అనే వారపత్రిక (1888-1927) ను స్థాపించి నడిపాడు. సుప్రసిద్ధ వచన రచయిత బి. వి. దొరస్వామిఅయ్యర్ సంపాదకత్వంలో మదరాసునుంచి 'సత్యసాధని' (1899-1905) అనే పత్రిక వెలువడింది.

రాయదుర్గంనుంచి యల్లంరాజు నారాయణమూర్తి 'విజ్ఞానవర్ధని' (1894) అనే పక్షపత్రికను ప్రచురించాడు. దాసం కేశవరావు సంపాదకత్వంలో 'జ్ఞానోదయం' (1893) అనే పత్రికకూడా వుండేది.

ఇవిగాక పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో దాసు శ్రీరామపండితుల-'అనల్ప జల్పితాకల్పవల్లి' (1880), సి. గోపాలయ్య-'టీచర్' (1888), నాదెళ్ళ పురుషోత్తమకవి 'బుధవిధేయ' (1880), క్రైస్తవమత ప్రచారంకోసం బళ్ళారినుంచి వెలువడిన 'లూథరిన్' (1891), సత్తిరాజు సీతారామయ్య సంపాదకత్వంలో ఏలూరు నుంచి వెలువడ్డ 'లావర్తమాని', 'దేశోపకారి' పత్రికలు, జనమంచి శేషాద్రిశర్మ సంపాదకత్వాన నెల్లూరునుంచి వెలువడ్డ 'ఆనందదాయిని' (1889) ముఖ్యంగా పేర్కొనదగినవి. సామాజిక సాహిత్యరంగాల్లో ఇవి ఎంతో సేవచేశాయి. కొమాండూరు వేంకటరామానుజశర్మ సంపాదకత్వాన నెల్లూరునుండి వెలువడిన 'వాగ్వల్లి' (1899-1903), శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి సంపాదకత్వంలో రాజమండ్రినుండి వచ్చిన 'కళావతి' (1900) ప్రజలకు గొప్ప సేవ చేశాయి.

అటు రాజకీయానికీ ఇటు సాహిత్యానికీ వారధిగా నిలిచిన పత్రిక 'కృష్ణా పత్రిక.' ఇది 1902 లో కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావుల సంయుక్త సంపాదకత్వంలో బందరునుంచి వెలువెడింది. తర్వాత ముట్నూరి, కాటూరి, కోలవెన్ను, కమలాకర, వై. వి. యల్., ముదిగొండ సంపాదకత్వాల్లో నడచిన కృష్ణా పత్రిక 1990 లో పునరుజ్జీవమై, ప్రస్తుతం హైదరాబాద్‌నుంచి పిరాట్ల సంపాదకత్వంలో వెలువడుతోంది.

*

2

# కృష్ణా పత్రిక అవతరణ - వికాసం

భారతజాతిని జాగృతం చేసేందుకూ, జాతీయోద్యమానికి చేయూతనిచ్చి భారతీయుల్లో దేశభక్తిని పెంపొందించేందుకూ, సాంఘిక దురాచారాలపై ధ్వజమెత్తి ఖండించేందుకూ పందొమ్మిదవ శతాబ్దాంతంలో దేశంలో అనేక పత్రికలు ప్రారంభ మయ్యాయి.

వీటిలో ప్రముఖ సంఘ సంస్కర్త రాజారామమోహన్‌రాయ్ పత్రికా స్వాతంత్ర్యంకోసం పోరాడడానికి బెంగాలీ భాషలో వెలువరించిన వారపత్రిక 'సంబద్ కౌముది' (1821 డిసెంబరు 4), ఆయనే పారసీ భాషలో నిర్వహించిన వారపత్రిక 'మిరాత్ ఉల్ అఖ్‌బార్' (1822 ఏప్రిల్), అనాటి పాలకులతో ఎన్నో పోరాటాలు జరిపి, దేశంలో ఒక్కడైనా నిజాయితీగల పత్రికారచయిత ఉండాలని ఘోషించిన బెంగాలీ వారపత్రిక 'అమృతబజార్', విదేశీపాలనలోకూడా భారతీయు లకు హక్కులున్నాయనీ, ప్రజలు వాటిని సాధించాలనీ, అవసరమైతే పోరాడాలనీ చాటిచెప్పిన లోకమాన్య బాలగంగాధర్ తిలక్ వ్యవస్థాపకుడై నడిపిన మరాఠీపత్రిక 'కేసరి', పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్ నడిపిన వారపత్రిక 'పంజాబీ', ఉర్దూ దినపత్రిక 'బందేమాతరం', ఆంగ్లవారపత్రిక 'ద పీపుల్' ప్రముఖమైనవి.

ఆ కాలంలోనే తెలుగునేలలో వెలుగు పందిళ్ళుగా కొన్ని పత్రికలు వెలిశాయి. వాటిలో ప్రముఖంగా పేర్కొనదగిన పత్రిక కృష్ణాపత్రిక. గాంధీమహాత్ముడి 'యంగ్ ఇండియా', 'హరిజన్' పత్రికల తర్వాత యువతరానికి స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తిని కలిగించిన పత్రిక 'కృష్ణాపత్రిక.'

తెలుగు పత్రికల్లో కృష్ణాపత్రికది అగ్రస్థానం. జాతితో నడుస్తూ, జాతిని నడిపిస్తూ జాతీయ జీవనంలో పాల్గొన్న దీపత్రిక. తెలుగుజాతిని జాగృతంచేసి, ఆంధ్రావనిలో నవచైతన్యం బహుముఖంగా వికసింపజేయడానికి కృషిచేసిం దీపత్రిక. తెలుగు పత్రికల్లో వజ్రోత్సవం చేసుకున్న మొట్టమొదటి పత్రిక కృష్ణాపత్రిక. సమకాలీన సమాజంమీద కృష్ణాపత్రిక ప్రభావం విశిష్టమైనది.

# కృష్ణాపత్రిక అవతరణ :

ఆంధ్రదేశంలో బందరు పట్టణానికి ప్రముఖ స్థానం ఉండేది. గొప్పఓడ రేవు పట్టణంగా, లలితకళలకు, సాహితీవేత్తలకు, కళాకారులకు, సంగీతవిద్వాంసు లకు నిలయంగా పేరుమోసింది. వీటన్నిటికీ తోడుగా రాజకీయంగా, సాంఘికంగా కూడా బందరుపట్టణం ఎంతో చైతన్యవంతంగా ఉండేది.

> "19వ శతాబ్దిలో కృష్ణామండలంలో గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలు కలిసి ఉండేవి. అన్నిరకాల చైతన్యాలకు నిలయమైన కృష్ణామండలంలో సంఘసంస్కరణశీలురు ఉత్సాహవంతులైన కొందరు యువకులు కలిసి 'కృష్ణాజిల్లా సంఘం'గా ఏర్పడ్డారు."[1]

రాజకీయ పరిజ్ఞానాన్ని ప్రజలకందించాలనీ, ప్రజలను మూఢాచారాలనుండి మరలించి సంస్కరించాలనీ, రైతుల కష్టసుఖాలను ఎప్పటికప్పుడు తెలుసుకొని వారికి సముచిత మైన సలహాల నందివ్వాలనీ, గ్రామీణ కుటీరపరిశ్రమల విశిష్టతను చాటిచెప్పాలనే సదాశయాలతో ఈ సంఘం క్రీ॥శ॥ 1892 లో ఏర్పడింది. విద్యార్థికులు, దేశ భక్తులు ఐన ఈ యువకులు తమ సంస్కరణాభిలాష కనుగుణంగా జాతీయభావాలతో కృష్ణాసంఘాన్ని ఏర్పాటుచేసుకున్నారు.

"1892 లో ఏర్పడ్డ కృష్ణాజిల్లా సంఘం క్రమక్రమంగా పుంజుకొని 1900 సంవత్సరం నాటికే ఒక పత్రిక నేర్పరచుకోవాలనే ఆలోచనకు వచ్చింది. రెంటాల వేంకటసుబ్బయ్య 1900 సంవత్సరంలో కృష్ణామండల సభకు అధ్యక్షత వహించి తమ ఆశయాల ప్రచారంకోసం పత్రికను నిర్వహించాలనే ఆలోచనను సభకు తెలిపాడు. ఈ ప్రతిపాదనతోపాటుగా ఆయనే మొట్టమొదటగా వందరూపాయల విరాళాన్నికూడా ప్రకటించాడు. వెనువెంటనే కృష్ణాజిల్లా సంఘంలోని ప్రధాన సభ్యులైన పురాణం వేంకటప్పయ్య, వేమూరి వేంకటసుబ్బారావు, కొడింబి హను మంతరావు, జంధ్యాల గౌరీనాథశాస్త్రి, కొండా వేంకటప్పయ్య, అయ్యంకి వేంకటా

---

1. 'దర్బారీయుడు' - అరువది రెండేండ్లు నిండిన 'కృష్ణాపత్రిక' - (వ్యాసం), ఆధారంగా - కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ 1964.

చలపతిరావు, పెద్దిభొట్ల వీరయ్య, వల్లూరి సూర్యనారాయణలు యథాశక్తి విరాళాలు అందించేందుకు వాగ్దానం చేశారు. జిల్లాసంఘ సంచారకార్యదర్శి శనగపల్లి రామస్వామిగుప్త చందాలు వసూలు చేయబూనారు."[1] దాని ఫలితమే 'కృష్ణాపత్రిక' ఆవిర్భావం. కృష్ణానదినిబట్టి, కృష్ణామండలాన్నిబట్టి వారు తమ పత్రికకు 'కృష్ణాపత్రిక' అని పేరుపెట్టి ఉంటారు. 1902 ఫిబ్రవరి 1వ తేదీన కొండా వేంకటప్పయ్య, దాసు నారాయణరావులు సంయుక్త సంపాదకులుగా కృష్ణాపత్రిక ప్రథమ సంచిక వెలువడింది.

ఆ పత్రికలోనే 'స్వవిషయం' అన్న శీర్షికలో తమ పత్రిక ప్రకటనావశ్యకతను తమ ఆశయాలను ప్రచురణకర్తలు క్రింది విధంగా వెలువరించారు.

> "ఇందు రాజ్యపద్ధతులను, దాని లోపములను నివృత్తిచేయు మార్గములను, సంఘసంస్కరణరీతులను, రసవాద, ప్రకృతిశాస్త్ర విశేషములను, వ్యవసాయమును, చేతిపనులు మొదలుగాగల నుపయుక్తవిషయములను వ్రాయుచుంటిమి. ఆ విషయములందు కూడ జనసామాన్యమునకు కొంతపాటి పరిచయము గలిగిన గాని దేశమభివృద్ధి గానేరదు. స్వలాభమును గోరక దేశాభివృద్ధికొరకై అభిమానబుద్ధితో బూనిన యీ ప్రయత్నమునకు కృష్ణామండలమునందలి చదువరులందరు తోడ్పడి దీనికి చందాదారులుగా జేరి దీని నభివృద్ధికి తెచ్చెదరని నమ్ముచున్నాము."[2]

ప్రజలను అనేక రంగాలలో జాగరూకులను చేసి, స్వలాభాపేక్ష లేకుండా దేశాభివృద్ధిని కాంక్షించడంకోసం ఆవిర్భవించింది కృష్ణాపత్రిక.

---

1. 'దర్బారీయుడు' - అరువది రెండేండ్లు నిండిన 'కృష్ణాపత్రిక' (వ్యాసం), పుట 8, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ : 14-2-1964.
2. కృష్ణాపత్రిక-1902 ఫిబ్రవరి 1, ప్రథమ సంచిక, పుట. 1.

# కృష్ణాపత్రిక వికాసం:

రాజకీయ, సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక రంగాలద్వారా ప్రజలను ఉత్తే జపరచిన కృష్ణాపత్రిక జీవితంలో కృష్ణ శుక్లపక్షాలెన్నో వున్నాయి. ప్రారంభంలో కృష్ణాపత్రిక 'పక్షపత్రిక'గా ఉండేది 1905 సంవత్సరం వరకు పక్షపత్రికగానే కొనసాగి, 1906-7 సంవత్సరాల మధ్య వారపత్రికగా మారింది. కృష్ణా జిల్లా వార్తలకే పరిమితంగా వెలసిన కృష్ణాపత్రిక క్రమంగా దేశ వ్యవహారాలను, సమస్యలను ప్రచురించడం ప్రారంభించింది. బందరు ఒడిలో పెరిగి, మద్రాసుబడిలో చదువు ముగించుకున్న ముట్నూరి కృష్ణారావు 1903వ సంవత్సరంలో కృష్ణాపత్రికలో సహాయ సంపదకుడుగా చేరాడు.

1905 లో పరిపాలనా సౌలభ్యంకోసం కృష్ణాజిల్లా విభజన జరిగి, గుంటూరు జిల్లా ఏర్పడటంతో కొండా వేంకటప్పయ్య స్వస్థలమైన గుంటూరు వెళ్ళిపోయాడు. సహసంపాదకుడుగాఉన్న దాసు నారాయణరావు 2-9-1905న దివంతుడయ్యాడు. దానితో కృష్ణాపత్రిక నిర్వహణ, సంపాదక బాధ్యతలు ముట్నూరి కృష్ణారావు మీద పడ్డాయి.

> ఈ తరుణంలోనే 'వంగదేశ విభజనతో భారతదేశమంతా కదలిపోయినట్లే కృష్ణామండలం కూడా కదలిపోయింది. స్వజాత్యభిమానంతో భారతీయ స్రవంతి ఉవ్వెత్తున పొంగింది. బంకించంద్రుని 'వందేమాతరం' మహా మంత్రమై భారత మాతృస్వరూపాన్ని భారతీయుల మనోనేత్రాలకు సాక్షాత్కరింపజేసింది. స్వజాతీయత యెడ అభిమానం, విజాతీయత యెడ వైముఖ్యం, స్వరాజ్య సంపాదన యందుత్సాహం- ఇవి ఒకదానికొకటి మించిన వెల్లువలై భారత జాతీయ లక్ష్యాలనే మార్చి వేశాయి.'[1]

---

1. 'దర్బారీయుడు'-అరువది రెండేండ్లు నిండిన 'కృష్ణాపత్రిక'-పుట. 3, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ : 14-2-1964

ఈ పరిస్థితుల్లో బిపిన్ చంద్రపాల్‌తోపాటు 1906లో కృష్ణారావు బెంగాలు పర్యటించాడు. ఈ మధ్యకాలంలో (1906-7 సంవత్సరాలలో) అవటపల్లి నారాయణ రావు కృష్ణాపత్రికను నిర్వహించాడు. బెంగాల్ పర్యటన అనంతరం కృష్ణారావు 1907లో తిరిగి కృష్ణాపత్రికలో చేరి సంపాదకత్వ బాధ్యతను స్వీకరించాడు.

అప్పుడే స్వదేశీయోద్యమ ప్రభావంతో అయిదువేల రూపాయల ఖర్చుతో 'కృష్ణా స్వదేశీ ముద్రాక్షరశాల' అనే ప్రెస్సును సేతు సోదరులుగా ప్రసిద్ధి కెక్కిన ఓల్లరిగె సేతు మాధవరావు, శ్రీనివాసరావుల నుంచికొని, పత్రికకు కృష్ణారావే సంపూర్ణాధిపత్యం వహించాడు. అప్పటి నుంచి కృష్ణాపత్రిక 1958 చివరలో మద్రాసుకు తరలివేళ్ళేవరకు, బందరులోని అదే ప్రెస్సులో అచ్చవుతూ ఉండేది.

1908లో కృష్ణాపత్రికకు విషమఘట్టం ఏర్పడి పత్రికను మూసివేయవలసిన పరిస్థితి ఏర్పడింది. వంగరాష్ట్ర విభజన, వందేమాతరం ఉద్యమ ప్రభావం కృష్ణారావులో ఒక నూతన చైతన్యాన్ని, జాతీయస్ఫూర్తిని కలిగించాయి. అంతవరకు మితవాదధోరణిలో నడుస్తున్న కృష్ణాపత్రిక వంగదేశంనుంచి తిరిగివచ్చిన కృష్ణారావు సంపాదకత్వంలో కొంత తీవ్రవాద ధోరణిని అలవరచుకొంది. బిపిన్ చంద్రపాల్ విప్లవ భావాలతో ఉత్తేజితుడైన కృష్ణారావు 'తెల్లవారిని తుపాకులతో కాల్చుట' అనే సంపాదకీయాన్ని రాశాడు. దానిని ప్రచురించాడు. అయితే ఆ వ్యాసముద్రణ ప్రమాద కరం అని గ్రహించి, వెంటనే అచ్చయిన కాపీలను పంపిణీ చేయకుండానే తగుల బెట్టారు. కానీ కొన్ని కాపీలు ప్రభుత్వ దృష్టిలో పడనేపడ్డాయి. ప్రభుభక్తి పరాయణుడైన నాటి జిల్లా కలెక్టర్ స్కాట్ ఈ సంపాదకీయం చదివి ఉగ్రరూపం దాల్చాడు. అయితే పత్రిక యజమానులు, జిల్లా సంఘం అధ్యక్షులు ఐన కొడింబి హనుమంతరావు కలెక్టర్‌కు మిత్రులైనందువల్ల ఒక వ్యక్తి చేసిన నేరానికి జిల్లా సంఘాన్ని అల్లరిపెట్టడం తన అభిమతంకాదని, ఆ వ్యాస రచయితను పత్రిక నుంచి తొలగిస్తే ఏ చర్యా తీసుకోనని స్కాట్, కొడింబికి తెలిపాడు. ఫలితంగా—

> 'కృష్ణారావుగారు, అవటపల్లి వారు 18-7-1908 నుండి కృష్ణాపత్రికతో సంబంధం వదులుకున్నారు'[1]

---

1. కృష్ణాపత్రికాధిపతులగు ముట్నూరి కృష్ణారావుగారును, సహాయ పత్రికాధిపతు లగు అవటపల్లి నారాయణరావుగారును ఈ నెల 18వ తేదీని తమఉద్యోగము లకు రాజీనామాయిచ్చి, నాటినుండియు పత్రికతో సంబంధం వదులుకొనిరని తెలియజేయుచున్నాము'- 19-7-1908 నాటి కృష్ణాపత్రికలో ప్రకటన.

దానితో పత్రిక క్లిష్ట పరిస్థితికి గురైంది. కొండా వేంకటప్పయ్య గుంటూరుకు వెళ్ళిపోయిన దగ్గరనుంచి జిల్లా సంఘం వారికి పత్రికపట్ల ఆసక్తి సన్నగిల్లింది. ఈ అవకాశంతో పత్రికను మూసివేయాలని కొందరు సభ్యులు సూచించారు. కానీ—

'ముట్నూరివారి సహాధ్యాయుడూ, సన్నిహిత మిత్రుడూ అయిన డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య కృష్ణాపత్రిక ఆగిపోరాదన్న దృఢసంకల్పం వ్యక్తపరచి, స్వచ్ఛందంగా పత్రిక బాధ్యతను తమ భుజస్కంధాలపై వేసుకున్నారు. దాదాపు మూడేళ్ళపాటు అడ్వొకేటు సి వి. రామాచారిగారి పేరిట కృష్ణాపత్రికను సక్రమంగా నిర్వహించి 1912 లో రెండువేల రూపాయల లాభంతో కృష్ణాపత్రికను ముట్నూరివారికి తిరిగి అప్పగించారు.'[1]

1912లో తిరిగి సంపాదకుడైన కృష్ణారావు లేఖిని గతానుభవ ప్రభావంతో ఒక విధమైన గడుసుతనం సంతరించుకుంది.

'చట్ట నిబంధనలకు చిక్కని వ్యంగ్యస్ఫూర్తితో బ్రిటిషుపరిపాలకుల నపహాస్యమొనరిస్తూ, తోడిదేశీయులలో జాతీయతా ప్రబోధం గావించిన వాక్చాతుర్యమది'[2] 'ఆంధ్ర దేశంలో స్వాతంత్ర్యోద్యమ చైతన్య వికాసానికి కృష్ణారావు సంపాదకీయాలు చేసిన దోహదం అసాధారణం. ఆ సంపాదకీయాలు కాలగతికి వ్యాఖ్యానం చెప్పాయి ఆనాటి దేశ పరిస్థితులకు దర్పణం పట్టాయి. ఒక్క రాజకీయాలనే కాక సాంఘిక, సాహిత్య, సంగీత, శిల్ప సంబంధమైన ఎన్నో విషయాలను ఆయన వాటిలో చర్చించారు. అందుకే కృష్ణాపత్రిక 'న్యూస్ పేపరు' కాదు, 'వ్యూస్ పేపరు' అనేవారాయన. ఆ సంపాదకీయాలు తేజోవంతాలేగాక రసవంతాలు కూడా.'[3]

---

1. బ్రహ్మయ్య, గొట్టిపాటి - 'మహా మేధావి డాక్టరు పట్టాభి సీతారామయ్య' (వ్యాసం)-పుట. 80; జాతి వెలుగులు.
2. వేంకటరావు, కమలాకర - పరిచయం, పుట. 7, కృష్ణరాయ సంపాదకీయ వ్యాసాలు - ౧. కృష్ణాపత్రిక ప్రచురణలు, ప్రథమ ముద్రణ : 1968
3. లక్ష్మణరెడ్డి. వి డా॥ - తెలుగు జర్నలిజం - అవతరణ - వికాసం, పుట. 378, ప్రథమ ముద్రణ : జనవరి 1985.

ఈ రచనాధోరణి పరిత్రలోకాన్ని ఉద్రూతలూగించి విస్మయ చకితుల్ని చేసి కర్తవ్యదీక్షాబద్ధులుగా మలిచింది. అందుకే సకలాంధ్ర జగత్తూ కృష్ణాపత్రికను ఆదర్శంగా తీసుకుంది.

> 'కృష్ణాపత్రిక సంపాదకీయాలు తెలుగునాట వాడవాడల్లో అమితాసక్తితో పఠించారు. ఆంగ్లంరాని అనేకులకు రాజకీయ పరిజ్ఞానం కలిగింది ఈ పత్రిక సంపాదకీయాలవల్లే. అవి అక్షరాస్యులలోనేగాక నిరక్షరాస్యుల్లోకూడా విజ్ఞాన వికాసం కల్గించాయి. గ్రామాల్లో రచ్చబండలపై కృష్ణాపత్రిక సంపాద కీయాలను ఒకరు చదువగా ఎంతోమంది గుంపులుగా చేరి వినేవారు, ఉత్తేజం పొందేవారు. ఆ సంపాదకీయాలలో ఆవేశం, అభినివేశం, అంతర్దృష్టి అధికం. అవి ఉపన్యాసాలలాగ ఉద్రేకం కలిగించేవి. క్లిష్టమైన జాతీయ సమస్యలు నిగూఢమైన అంతర్జాతీయ ప్రశ్నలు,అగాధతత్త్వ రహస్యాలు,సునిశిత సాహిత్య విషయాలు మొదలైన వాటిపై ఉచిత వ్యాఖ్యానాలకూ, విశిష్ట విశదీకరణలకూ వారందరూ ముగ్ధమోహితులయ్యేవారు.'[1]

అయితే 1930లో శాసనోల్లంఘనోద్యమ సందర్భంగా బ్రిటీష ప్రభుత్వం ఒక ఆర్డినెన్స్‌ను జారీచేసింది. ఆ ఆర్డినెన్స్‌ను వ్యతిరేకించిన కారణంగా కృష్ణారావును సంవత్సరకాలం రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు. మళ్ళీ జనవరి 4, 1932న అరెస్టు చేశారు.

> కృష్ణారావు 'బందరులో 144 సెక్షను నుల్లంఘించిరి. రెండు సంవత్సరములు కఠిన నరకము, పదునొకండు వందల రూపాయల జరిమానా. తప్పినచో, 4 నెలలు కఠిన నరకము విధింపబడినది.'[2] అని కృష్ణాపత్రిక రాసింది.

ఈ కాలంలో కృష్ణారావు కోరికమేరకు కోట సుబ్బారావు దాదాపు మూడేండ్లు సంపాదకత్వ బాధ్యతను స్వీకరించాడు. కోట సుబ్బారావుకు సహాయ సంపాదకులుగా విశ్వనాథ వేంకటేశ్వర్లు, నార్ల వేంకటేశ్వరరావులు ఉండేవారు.

---

1. లక్ష్మణరెడ్డి, వి. డా॥ - తెలుగు జర్నలిజం - అవతరణ - వికాసం, పుటలు. 378, 379, ప్రథమ ముద్రణ : జనవరి 1985.
2. కృష్ణాపత్రిక - 1932 జనవరి 9, పుట. 7

1933లో కమలాకర వేంకటరావు, 1938లో రావూరు వేంకట సత్యనారాయణ రావులు కృష్ణాపత్రిక సంపాదకవర్గ సభ్యులయ్యారు.

కృష్ణారావు 1935లో జైలునుంచి విడుదలయ్యాడు. అప్పటి నుంచి 1945 జూన్ 23లో ఆయన మరణించేవరకు కృష్ణాపత్రిక ఎటువంటి ఒడిదుడుకులకు లోనుకాకుండా నిర్వహించాడు.

1945లో కృష్ణారావు తన మరణానికిముందే తదుపరి కృష్ణాపత్రిక నిర్వహణకు విల్లు సిద్ధం చేశాడు.

'కృష్ణారావుగారు చికిత్సకోసం మద్రాసు వెళ్ళబోయేముందు కృష్ణాపత్రికను, అచ్చుఆఫీసును నిర్వహించడానికి ధర్మకర్తృత్వ సంఘం ఏర్పాటు చేసారు :-

1. తన తరువాత సంపాదకుడుగా ఉండబోయే మహాకవి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు.
2. తమ పత్రిక ఆఫీసులో ఉప సంపాదకులుగా ఉన్న శ్రీ కమలాకర వేంకటరావు.
3. శ్రీ రావూరు వేంకట సత్యనారాయణ.
4. ఆఫీసు మేనేజరు : శ్రీ కాజ శివరామయ్య.
5 ప్రెస్సు, కృష్ణాపత్రిక తన స్వంతం కాబట్టి తనస్థానే తన మనుమరాలు కుట్టెమ్మ (ముద్దుపేరు) అసలు పేరు శ్రీమతి నరసాబాయికి (ఆచార్యులు వంగర శివరాంగారి కుమార్తె - శౌంరి రామమూర్తిగారి కోడలు) చెందేటట్లు రాశారు. ఈ అయిదుగురిని పాలకవర్గంగా ఏర్పాటు చేశారు. యజమాని, ఉద్యోగులు సమష్టిగా ప్రతిష్ఠాపనలను నిర్వహించి అవి తమవిగా భావించు కొని, అందువల్ల వచ్చిన లాభాలను అనుభవించి ఆనందించుట ప్రజా స్వామ్యం. ఇదే సామ్యవాదం. అందుకు అనుగుణంగా ఈ పాలకవర్గంను ఏర్పరచుట జరిగింది. వ్రాసినది, ప్రబోధించినది ఆచరించుట ఆయన పద్ధతి. అందులకు ఇది నిదర్శనం'[1] అని గొట్టిపాటి బ్రహ్మయ్య 'జాతి వెలుగుల్లో' రాశాడు.

---

1. బ్రహ్మయ్య, గొట్టిపాటి-జాతి వెలుగులు-పుట. 127, ద్వితీయముద్రణ : 1979

కృష్ణారావు నిర్యాణానంతరం ఆయన వీలునామాననుసరించి కాటూరి వేంకటేశ్వరరావు విడిగా కొంతకాలం, కోలవెన్ను రామకోటేశ్వరరావుతో కలిసి కొంతకాలం, కమలాకర వేంకటరావుతో కలిసి మరికొంతకాలం పత్రికా సంపాదకత్వం నిర్వహించాడు.

ఆటు పిమ్మట 1952లో ఆర్. డి. యల్ నరసింహమూర్తి యాజమాన్యంలో కమలాకర వేంకటరావు సంపాదకత్వంలో మరొక ఆరు సంవత్సరాలు వెలువడింది. ఆనంతరం ఒక సంవత్సరకాలం ముట్నూరి మనుమడు రామకృష్ణారావు యాజమాన్యాన పత్రిక నడిచింది. తర్వాత వి. వై. యల్. నరసింహారావు ఆధ్వర్యవంలోకి మారింది. అయితే ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ కృష్ణాపత్రిక బాధ్యతను అచిరకాలంలోనే అంటే 1960లో స్వీకరించి, 1970 వరకు హైదరాబాద్ నుంచి పత్రికను జయప్రదంగా నడిపాడు తెలంగాణా ఉద్యమ కారణంగా 1970 జూన్‌లో కృష్ణాపత్రికను విజయవాడకు తరలించారు. కారణాంతరాల వల్ల విజయవాడలో కూడా ముదిగొండ పత్రికను కొనసాగించలేకపోయాడు. 1971 అక్టోబరులో కృష్ణాపత్రికను తెనాలి తరలించాడు. అక్కడ అనుకోని అవాంతరాలు ఏర్పడటం వల్ల, వృద్ధాప్యం పైన బడటంవల్ల ముదిగొండ తెనాలిలో కూడా పత్రికను నిర్వహించలేకపోయాడు. తిరిగి 1979లో ఆయన హైదరాబాద్ చేరుకున్నాడు అప్పుడు ముదిగొండ కుమారుడు నాగేశ్వరరావు కొన్నాళ్ళు పత్రిక నిర్వహించాడు.

నాగేశ్వరరావు నుండి 1984లో పత్రిక నిర్వహణ బాధ్యతలు స్వీకరించిన పిరాట్ల వేంకటేశ్వర్లు, ప్రస్తుతం హైదరాబాద్ నుండి కృష్ణాపత్రికను దినపత్రికగా వెలువరిస్తున్నాడు.

# కృష్ణాపత్రిక స్వరూపం :

కృష్ణాపత్రిక పుటలలో సంపాదకీయాలు ప్రముఖపాత్ర వహించినా, ఆసక్తి జనకమైన, కళాపూరితమైన, సారస్వత, శిల్పసంపదలకు నిలువుటద్దాలయిన హాస్యానికి, హర్షానికి ఆలంబనమైన శీర్షికలెన్నో వుండేవి.

'అభినయము - రూపకములు', 'కావ్యమీమాంస - శాస్త్రవిచారము', 'కల్పనా కథలు' మొదలైన శీర్షికలను ధారావాహికంగా ప్రచురించేవారు. 'రసమంజరి' శీర్షికలో కవిత్వం ప్రచురించేవారు. ఇందులో చిత్రమాలికలను సెట్టి లక్ష్మీనరసింహం రాసేవారు.

అంతేగాక పింగళి నాగేంద్రరావు, కాటూరి వేంకటేశ్వరరావు; విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు; విశ్వనాథ వేంకటేశ్వర్లు, సర్వా వేంకట శేషయ్య; సబ్నివీసు గురునాధరావు, సబ్నివీసు రామారావు; టి. చలమయ్య, ప్రసాద రావులు; శేషాద్రి రమణకవులు; వేమూరి వేంకట రామనాధం, వేమూరి రామకృష్ణ తిలక్; కామరాజుగడ్డ శివయోగానందరావు, కొడాలి వేంకట సుబ్బారావుల వంటి పలువురు 'జంటకవులు' రచనలు చేసేవారు

కవికొండల వేంకటరావు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, చిరాపూరు కామేశ్వరరావు, నాయని సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి, అడవి బాపిరాజు, బొడ్డు బాపిరాజు, ఊటుకూరు సత్యనారాయణరావు, వెంపటి నాగభూషణం వంటి ప్రముఖ కవుల రచనలు ఈ శీర్షికలో చోటు చేసుకునేవి.

అలాగే 'బాలానందం' శీర్షికలో బాలసాహిత్యం, 'గ్రంథసమీక్షలు' శీర్షికలో గ్రంథవిమర్శ, 'వార్తావళి', 'వివిధ విషయాలు' శీర్షికల్లో క్లుప్తంగా జాతీయ, అంతర్జాతీయ వార్తలు, 'ఆకాశవాణి' పేరుతో రేడియో ప్రసంగ వ్యాసాలు, 'వెండితెర' శీర్షికలో సినిమా విశేషాలు ప్రచురించేవారు ఈ శీర్షికలో కమలాకర కామేశ్వరరావు 'సినీవాలి' పేరుతో రచనలు చేశారు. ఇవేగాక, 'కాలవాహిని', 'గ్రామ సమాచారములు', 'చరిత్ర చణుకులు' అనే శీర్షికల్లో సంక్షిప్త సమాచారాన్ని అందించేవారు. 'విచిత్ర చిత్రావళి' శీర్షికలో కార్టూన్ సంభాషణలు, 'ఆంధ్రవాణి', 'తపాలాపెట్టె' అనే శీర్షికల్లో లేఖలు ప్రచురించేవారు.

రావూరు సత్యనారాయణరావు నిర్వహించిన 'వడగళ్లు' శీర్షిక హాస్యరసంతో పాఠకులను ఓలలాడించేది. 'వివిధ విషయాలు' శీర్షికలో ప్రచురించిన తమాషా సంగతులు తీసి ఆయన వడగళ్ళు రాసేవాడు. 'రావూరు' పేరు లేకుండా ఈ శీర్షిక నడిపేవారు.

ప్రముఖులు అనేకులు కృష్ణాపత్రికలో అమూల్య రచనలు చేసేవారు. మల్లాది రామకృష్ణశాస్త్రి 'పరమానందయ్య శిష్యుడు' అనే కలం పేరుతో కొన్ని తమాషాలతో రాసే 'చలువ మిరియాలు', 'దర్బారు శాయరు', పేరుతో కాటూరి వేంకటేశ్వరరావు చిలికించే 'పన్నీటి జల్లు'లు పాఠకుల మన్ననలను పొందాయి. మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి 'చాటువులు' పత్రికలో చోటుచేసుకున్నాయి. అలాగే 'సూర్యం చెప్పిన కథలు' శీర్షికన అబ్బూరి రామకృష్ణారావు రచనలు చేసేవారు.

చెరుకువాడ వేంకట నరసింహం ప్రతి సంవత్సరం పంచాంగం రాసేవాడు. దీనిలో ఎంతో వ్యంగ్యం, విమర్శ వుండేది. అందుచేతనే చెరుకువాడను 'బ్రహ్మశ్రీ ముట్నూరి కృష్ణరాయ నష్టజాతక సిద్ధాంతి' అనేవారు.

కృష్ణాపత్రికలో పింగళి నాగేంద్రరావు 'పాషాణి', 'జేబున్నీసా', 'మేవాడ్ రాజ్యపతనం'వంటి బెంగాలీ నాటకాలు అనువదించాడు. శ్రీకృత్తివాసతీర్థులు'దయ్యాలు' నాటకం, సబ్నవీసు రామారావు 'రైతుబిడ్డ' నాటకం రాశారు. అద్భుతమైన భాషలో వేలూరి చంద్రశేఖరం అందించిన చరిత్రాత్మక నాటకం 'కాంచనమాల' ప్రముఖంగా పేర్కొనతగింది.

అలెగ్జాండర్ డ్యూమస్ నవలను కాటూరి వేంకటేశ్వరరావు 'నల్లకలువ' పేరుతో అనువదించాడు. మునిమాణిక్యం నరసింహారావు 'తిరుమాళిగ' నవలను వెలువరించాడు

కృష్ణాపత్రిక రవీంద్రనాథ్ ఠాగూర్, ప్రేమ్‌చంద్, శరచ్చంద్రఛటోపాధ్యాయ వంటి వంగకవుల సాహిత్యాన్ని ఆంధ్రులకు అందించింది. అవనీంద్రనాథ్‌ఠాగూర్, నందలాల్‌బోస్ మొదలైన వంగచిత్రకారులను గురించి ఆంధ్రలోకానికి పరిచయం చేసింది. ఈవిధంగా వంగప్రతిభను విశేషంగా వెల్లడించడంతో ఈ పత్రిక వంగ సంప్రదాయ సంస్కారాల ప్రచారసాధనంగా పరిణమించిందనుకున్నవారున్నారు. తొలిదశలో కృష్ణాపత్రిక కొంతవరకు వంగసంప్రదాయాలకు ప్రాధాన్యమిచ్చినా, పిదప అది ఆంధ్రసంప్రదాయాలను అనుసరించి ఆంధ్రజాతీయతకు నివాళులెత్తింది. ఆంధ్రుల సహజ ప్రతిభను తెలుగునేల నాలుగు చెరగుల వెదజల్లింది.

"దేశచరిత్రలోని వివిధ ఘట్టాల్లో వివిధోద్యమాలకు కృష్ణారావు చేసిన వ్యాఖ్యానాలు వెలుగుబాటలయ్యాయి. ముఖ్యంగా సహాయనిరాకరణోద్యమ కాలంలో గాంధీజీ నవీన సిద్ధాంతాలను విశదపరచటంలో కృష్ణాపత్రిక ప్రముఖ స్థానం వహించింది. ఖాదీ, హరిజనోద్ధరణ, హిందూ ముస్లిం సమైక్యం మొదలైన సాంఘిక సమస్యలను విపులంగా వ్యాఖ్యానించి నిర్మాణకార్యక్రమాలకు దోహదం చేసింది"[1] కృష్ణాపత్రిక.

ఈ విధంగా కృష్ణాపత్రిక స్వరాజ్య సంసిద్ధికి, స్వరాష్ట్ర సంపాదనకు దేశ ప్రజలను ఆయత్తపరచింది. కృష్ణారావు సంపాదకీయాలద్వారా దేశభక్తిని ప్రబోధించింది. అంతేకాదు, సాంఘిక, రాజకీయ, కళా, సాహిత్య, వైజ్ఞానిక రంగాలలో ఆంధ్రజాతీయ పురోభివృద్ధికి దోహదం చేసి, పత్రికానిర్వహణ వైశిష్ట్యాన్ని తెలిపే విధంగా వికాసాన్ని పొంది భావితరాలకు స్ఫూర్తినిధి అయింది.

1. గోపాలరెడ్డి, బెజవాడ -'నే నెరిగిన కృష్ణాపత్రిక' (వ్యాసం) - పుటలు. 8, 9 ఆధారంగా, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ : 14-2-1964.

# 3

# ముట్నూరి కృష్ణారావు జీవితం-వ్యక్తిత్వం

భారతదేశం గాంధీమహాత్ముని నాయకత్వాన స్వాతంత్ర్య పోరాటంలో నిమగ్నమైన కాలంలో దేశాభిమానాన్ని, స్వాతంత్ర్యకాంక్షను, ప్రజల్లో ప్రబోధింపజేయడానికి ఆసేతు హిమాచలం ఎందరో మహానుభావులు నడుంకట్టారు. వారిలో తెలుగుదేశాన గణుతికెక్కిన విజ్ఞాన సముద్రుడు ముట్నూరి కృష్ణారావు.

ఈ శతాబ్దంలో తెలుగుజాతిని జాగృతం చేసిన మహనీయులలో ముట్నూరి కృష్ణారావుకు విశిష్టస్థానం వుంది కొన్ని దశాబ్దాలపాటు కృష్ణాపత్రికకు సంపాదకుడిగా ముట్నూరి తన సంపాదకీయాలద్వారా తెలుగు ప్రజానీకానికి మార్గదర్శకత్వం వహించాడు. కృష్ణాపత్రిక అంటే వెంటనే కృష్ణారావు గుర్తుకు వస్తాడు.

ప్రముఖ రచయిత, చిత్రకారుడు కృష్ణారావు సన్నిహిత సహచరుడైన అడవి బాపిరాజు, కృష్ణారావు సుందర విగ్రహాన్ని రమణీయంగా ఇలా అభివర్ణించాడు.

> ''శ్రీ కృష్ణరాయలు సుందరాకారుడు మేలిమి బంగారుచాయ, విశాల ఫాలము, ఆకర్ణాంతఇందీవరపత్రాలైన నేత్రాలు, గరుడనాసిక, సమమైన కోలమోము, ఆమ్రఫలచిబుకము, శ్రీకరాలైనలంబకర్ణాలు విపులవక్షుడు, దీర్ఘబాహుడునూ, తెల్లని కోరతలపాగా ధరించి, మోకాళ్ళవరకూ వేళ్ళాడే తెల్లనిచొక్కా ధరించి వేగంగా ఆయన నడచి వెడుతూవుంటే ఒక దివ్యుడు భూమికవతరించినట్లే వుండేది.''[1]

## జీవితం :

కృష్ణారావు 1879 వ సంవత్సరంలో జన్మించాడు. ఆయన పుట్టగానే తల్లి మరణించింది. బాల్యంలోనే తండ్రి పరమపదించాడు. పినతండ్రి ప్రాపకంలో

---

1. బాపిరాజు, అడవి - మహాపురుషుడు (వ్యాసం) - పుట. 115, రసతపస్వి కృష్ణారావు - సంకలనకర్త, ప్రచురణకర్త : గొట్టిపాటి వేంకట సుబ్బయ్య, ప్రథమ ముద్రణ-1972.

ముట్నూరి బాల్యం గడిచింది. ఆయన తన తల్లిని తలచుకొన్నప్పుడల్లా లోలోనే 'నేను మాతృహంత'నని దుఃఖించేవాడట. పసితనంలోనే ఆయన తీవ్రవ్యాధిగ్రస్తుడై వెంట్రుకవాసిలో మృత్యువువాత తప్పించుకున్నాడు.

కృష్ణారావు ప్రాథమిక విద్యాభ్యాసం బందరు హిందూ పాఠశాలలో జరిగింది. పిదప బందరులోని నోబుల్ కళాశాలలో ఎఫ్.ఏ, లో చేరిన కృష్ణారావు కులపతి రఘుపతి వేంకటరత్నం నాయుడు శిష్యుడయ్యాడు. నాయుడు దగ్గర అంతేవాసిత్వం కృష్ణారావులోని జిజ్ఞాసను, తాత్త్వికతను వికసింపజేసింది. కులపతి సంఘసంస్కరణ శీలత, మూఢాచారనిర్మూలన వంటి ఉద్యమాలు కృష్ణారావును ప్రభావితుణ్ణి చేశాయి.

కృష్ణారావు సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. ఉపని షత్సారాన్ని ఆపోశనం పట్టాడు ఆంగ్ల సాహిత్యాన్ని అభిమానంతో అభ్యసించాడు. బందరు వదలిపెట్టి మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో బి. ఏ ,లో చేరాడు లెక్కల తరగతిలో చాటుమాటుగా ఎమర్సన్‌ను చదవడం వల్లా, అవకాశం చిక్కినప్పుడల్లా తాత్త్విక గ్రంథాలను పఠించడంవల్లా, వాల్ట్ విట్మన్, షెల్లీ, కూపర్‌ల వంటి పాశ్చాత్య మనీషుల రచనలను అధ్యయనం చేయడంవల్లా కృష్ణారావు ప్రజ్ఞ ద్విగుణీకృతమైంది. అయితే బి. ఏ ,లో మాత్రం ఆయన నెగ్గలేకపోయాడు. ఆ సమయంలోనే పట్టాభి సీతారామయ్య ఆయనకు సహాధ్యాయుడుగా ఉన్నాడు.

కృష్ణారావు 1903లో విద్యాభ్యాసానంతరం బందరు చేరుకొని కృష్ణాపత్రికలో సహాయ సంపాదకుడుగా చేరి 1907లోనే సంపాదకుడైనాడు. తదాది 1945లో పరమపదించేవరకు (మధ్యలో కొంతకాలం కారాగారవాసం తప్పించి) తానే పత్రికాధి పతిగా, సంపాదకుడుగా ఉన్నాడు. తెలుగు భాషలోనే కాక ఇతర భాషల్లోనూ ఇంత ఎక్కువ కాలం పత్రికానిర్వహణ చేసినవారు అరుదు. కృష్ణాపత్రిక ద్వారా ఆయన తెలుగు మాట్లాడే ప్రజల్లో స్వాతంత్ర్య భావాలను ప్రచారంచేసి ఎందరో నాయకులను సృష్టించాడు. కృష్ణాపత్రిక సంపాదకీయాలు చదివి అనేకులు కర్తవ్యపరాయణు లయ్యారు. సమకాలీన రాజకీయాలను గురించేకాక సాహిత్యం, కళలు, సంస్కృత విద్య, ఆర్థిక సమస్యలు మొదలైన అనేక విషయాలను గురించి కృష్ణారావు గొప్ప సంపాదకీయాలు వ్రాశాడు. రాజకీయంగానూ, సాంస్కృతికంగానేకాక, చారిత్రకంగా

కూడా ఈ సంపాదకీయాలకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. తెలుగులో కృష్ణారావు వచన రచనాశైలి విలక్షణమైంది. తెలుగు రచయితల్లో ఆయనది సమున్నతమైన స్థానం.

ముట్నూరి కృష్ణారావు తనలో గల తత్త్వవేదాంత, కవిత్వ, సాహిత్య, నృత్య గాన విషయాలను వెలికితీసి కృష్ణాపత్రికలో గొప్ప సంపాదకీయాలుగా వెలువరిస్తున్న సమయంలో ఆయనకు వంగరాష్ట్రం నుంచి పిలుపు వచ్చింది.

బిపిన్ చంద్రపాల్ స్వాతంత్ర్యసమరానికి శంఖం పూరించాడు. అరవిందుడు అండగా నిలిచాడు. తిలక్ ఆశీర్వదించాడు. ఆ పిలుపు విని కృష్ణారావు కలకత్తా వెళ్ళి పాల్ శిష్యకోటిలో చేరాడు. ఆయనతో కలసి భారత పర్యటన జరిపి సమర తంత్రాన్ని అవగతం చేసుకున్నాడు.

విప్లవజ్యోతిని వెంటబెట్టుకొని ముట్నూరి ఆంధ్రదేశానికి తిరిగివచ్చి, పత్రికా నిర్వహణలో కుదుట పడ్డాడు. కలాన్ని కత్తిగా మార్చుకొని రచనలు సాగించాడు. తెలుగు ప్రజలు ముట్నూరి సంపాదకీయాలను కొన్నిటిని 'రక్తచిత్రా'లనీ, కొన్నిటిని 'సాహిత్య సందేశా'లనీ, కొన్నిటిని 'అపూర్వ విమర్శ పత్రా'లనీ, కొన్నిటిని అత్యుత్తమమైన 'రాజకీయ రసాంకా'లనీ, మరి కొన్నిటిని 'వసంతారామపులకిత పరభృతగానా' లనీ, కొన్నిటిని 'తేనెవాక'లనీ, మరి కొన్నిటిని 'మినువాక గలగల'లనీ ప్రశంసించారు.

> "కృష్ణాపత్రిక పుటలలో, పైవారం ఏ చిత్రపటం దర్శనమిస్తుందోనని పాఠకలోకం తహతహలాడెడివారు. అది రాజకీయమా ! సాహిత్యమా ! శిల్పమా ! కవనమా ! గానమా ! ప్రకృతి పరిశోధనమా ! ఈశ్వర స్వరూప సందర్శనమా ! భాస్వరుద్దీపనా పరమైన వేదాంతమా ! జీవిత నైరాశ్యమా ! నశ్వరత్వమా ! శాశ్వతత్వమా ! ఏది రాబోవు చిత్రపటం ?"[1] అని ఉత్కంఠతో ఎదురు చూసేవారట.

---

1. వేంకట సత్యనారాయణ, రావూరు—'సంపాదకీయాలు' (వ్యాసం)-పుట. 77. మన ముట్నూరి — కళాప్రపూర్ణ రావూరు. ప్రచురణ : డా. రావూరు వెబ్బయ్యావ జన్మదినోత్సవ సమ్మాన సంఘం, హైదరాబాద్, 1981.

"అరవెచ్చగా కాగిన రక్తం ఎదలో పరుగులు తీస్తుండగా, పదిలంగా కూర్చుని కదలక, మెదలక అదునైన పదునైన చిత్రాలు గీసి పత్రికకు అందించి 'ఇది మీ సొత్తు' అని పాఠకలోకానికి వదలి, నిష్కామకర్మయోగిగా నిలబడ గలిగిన నిండుతనం కృష్ణారావుగారి కొక్కరికే సొంత"[1] మట.

# వ్యక్తిత్వం :

ముట్నూరి కృష్ణారావు బహుముఖీన ప్రజ్ఞాశాలి. రచయితగా, దార్శనికుడుగా, తాత్త్వికుడుగా, సంఘ సంస్కరణాభిలాషిగా, స్వాతంత్ర్యసమరయోధుడుగా ఆయన వ్యక్తిత్వం బహుధా ప్రశంసనీయమైంది.

గాంధీమహాత్ముని సందేశం విని, ఆయన అనుచరుడుగా మారి, భారతమాత పొందే వేదన ఎదలో నింపుకొని, క్షణక్షణం ఆమె పసిడిపాదాలు క్షాళనంచేసి, ఆ పవిత్రోదకం శిరస్సున చల్లుకొనే మహా సంకల్పంతో జీవితాన్ని వెలుగుబాటలో నడి పించుకున్న ప్రముఖ బాటసారి ముట్నూరి.

నాటి జాతీయోద్యమ సమయంలో చెరసాలలు మనోజ్ఞశాలలయ్యాయి. ఉరి దండలు విరిదండలయ్యాయి. ముట్నూరి కృష్ణారావు ప్రజలకు ప్రబోధించడమేకాక తానే స్వయంగా ఉద్యమాలకు నాయకత్వం వహించాడు. ఉప్పు సత్యాగ్రహం, శాస నోల్లంఘన సమయాల్లో ఆయన స్వయంగా పాల్గొని తోడి సత్యాగ్రహులకు ఉద్యమ స్ఫూర్తి నందించేవాడు. 1920-21వ సంవత్సరంలో తూర్పు కృష్ణాజిల్లా సంఘానికి అధ్యక్షుడుగా కూడా వ్యవహరించాడు. 1930లో, 1932లో, 1943లో ముట్నూరి కారాగారవాసాన్ని అనుభవించాడు. 1932లో రాయవెల్లూరు జైలులో ఉన్నప్పుడు సహసత్యాగ్రహులకు తత్త్వశాస్త్రం, యోగశాస్త్రం, సంస్కృత నాటకాలు, కావ్యాలూ వినిపించి వివరించేవారట.

---

1. వేంకట సత్యనారాయణ, రావూరు-'సంపాదకీయాలు' (వ్యాసం) - పుట. 77. మన ముట్నూరి—కళాప్రపూర్ణ రావూరు. ప్రచురణ : డా. రావూరు డెబ్బయ్యవ జన్మదినోత్సవ సమ్మాన సంఘం, హైదరాబాద్, 1981.

గాంధీమహాత్ముడు కృష్ణారావునుగూర్చి—

"అతని కళ్ళల్లో ఆధ్యాత్మికతేజం నాకు పొడగట్టుతున్నది. 'I see the spiritual spark in his eyes' అని పట్టాభిగారితో అన్నార"[1] ని తెలుస్తుంది.

కానీ కృష్ణాపత్రికను వదలి గాంధీతో వెళ్ళడానికి కృష్ణారావు అంగీకరించ లేదు. రాజకీయంగా ఆయన అంతేవాసిగానే వుండాలని సంకల్పించుకున్నాడు. అందు వల్ల పత్రికారంగంలోనే ప్రత్యక్షవీరుడుగా సాక్షాత్కరించాడు. 'వేయి కత్తుల కన్న ఒక కలం మిన్న' అన్న ఆర్యోక్తి ఆనవాలుగా నిలవగలిగాడు. పత్రికా సంపాద కుడిగా నాలుగు గోడలమధ్య ఉన్నట్లు కనిపించినా ఆయన మనసు రాజకీయరంగం లోనే పరిభ్రమిస్తూ ఉండేది. పంచబంగాళమైన భారత స్వాతంత్ర్యాన్ని, వంచన పాలైన భారత జాతినీ తుంచి, దూరంగా విసిరివేయబడిన భారత సంస్కృతిని పున రుద్ధరించాలనే దీక్ష ముట్నూరిలో ద్యోతకమయ్యేది.

కృష్ణాపత్రిక కార్యాలయంలో అర్ధరాత్రివేళ రాజకీయ నాయకుల రహస్య సమావేశాలు జరుగుతూ ఉండేవి. ఎప్పుడూ బండి ఎక్కని కృష్ణారావు బండిలో రహస్యంగా అక్కడికి వస్తూండేవాడు ఆ సమావేశంలో సత్యాగ్రహానికి సంబంధిం చిన నిర్ణయాలు తీసుకొనేవారు. ఆ కార్యాలయం చుట్టూ సి ఐ.డీలు తిరుగుతుండేవారు.

కృష్ణారావు దృష్టిలో సృష్టి ఒక కళానిలయం. "నశ్వరమైన ఈ జగత్తులోనే శాశ్వత తత్త్వాన్ని కల్పించే సౌందర్య స్వరూపమేదో దాగివున్నదనీ, దాని అన్వేషణే జీవితధ్యేయ"[2] మనీ ముట్నూరి భావించాడు.

కృష్ణారావు ఏ సిద్ధాంతానికీ కట్టుబడిపోయినవాడు కాడు. తన అంతస్సాక్షి చైతన్యమే వెలుగు ఉవ్వెగా తనకు దారి చూపగా స్వతంత్రపధాన నడిచి సకల

1. వేంకటరావు' కమలాకర-నవ్యాంధ్రలో కృష్ణాపత్రిక స్థానం-కృష్ణారావుగారు (వ్యాసం) - పుట. 17, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రధమ ముద్రణ : 14-2-1964.

2 వేంకట సత్యనారాయణ, రావూరు—మా గురుపాదులు (వ్యాసం)-పుట. 20. కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మ, ప్రథమ ముద్రణ : 1964.

సిద్ధాంతాలను ఆ మహాయాత్రలో దారిబత్తెంగా ఉపయోగించుకున్నాడు. పత్రికా సంపాదకుడిగా కాలగతికి వ్యాఖ్యానం చెప్పడమే ఆయన చేయదలుచుకొన్నపని.

రవీంద్రుని కవితాతత్త్వాన్ని గురించిగానీ, గాంధీమహాత్ముని అహింసా యోగాన్ని గురించిగానీ కృష్ణారావు చేస్తూవచ్చిన వ్యాఖ్యానాలు ఆయన భావుకతకూ, సమన్వయశక్తికీ నిదర్శనాలు.

> ''కుచ్చు జారవిడిచి చుట్టిన తెల్లని తలపాగా మోకాళ్ళవరకూ జీరాడే తెల్లని లాల్చీ, కుచ్చెళ్ళు వెనుకకు విరిచికట్టిన తెల్లనిదోవతి, కాళ్ళకు నగిషిపనితనపు నాటుచెప్పులజోడు, చేతిలో సింహతలాటపు తాటిచేవ చేతికర్ర, దబ్బపండు వంటి మేనిఛాయ, తేజస్సు వెల్లిగక్కే ముఖమండలం - ప్రసన్నగంభీరమైన ఆ మూర్తిలో ఏదో అనిర్వచనీయమైన ఆకర్షణశక్తి ఉండేది''.[1]

బాహ్యాడంబరాలేవీ కృష్ణారావుకు గిట్టేవికావు. పత్రికలో సంపాదకుడిగా తన పేరు చిట్టచివర చిన్న అక్షరాల్లో ప్రచురించేవాడు. అదైనా తప్పనిసరికాబట్టి. ఇక తన బొమ్మ పత్రికలోపడటం నచ్చేదికాదు. తన ఫోటో తీసుకోడానికి ఎవరికీ అవ కాశమిచ్చేవాడుకాడు. అలాగే తన పుట్టినరోజు పండుగ చేసుకోవడంగాని, ఇతరుల చేత చేయించుకోవడం గాని ముట్నూరికి ఇష్టంలేదు.

> ''అసలు వారి పుట్టిన రోజేదో ఎవ్వరికీ తెలియదు. వారు తెలియనివ్వలేదు. పట్టాభిగారికంటే ఒక సంవత్సరం పెద్ద అనే స్థూలమైన అంచనా ప్రకారం 1879లో వారు జన్మించారనేది మాత్రమే లోకానికి తెలుసు''.[2]

అంతర్మథనంలో పుట్టిన తన భావాలకే తప్ప, వ్యక్తి ప్రచారం కృష్ణారావుకు గిట్టేదికాదు. భావప్రపంచమే ఆయన నిత్యవిలాసం. నిరంతరం ఈ భావ సమాధిలో మునిగివుండి మౌనముద్రాంచితులై చూపరులకు ఋషివలె కనిపించేవాడు. ఆయన దరిచేరడానికే చాలమందికి భయంగా వుండేది. కాని కాస్త ధైర్యంచేసి ముట్నూరి సన్నిధి చేరగలిగిన వారికి ఆయనంత సుప్రసన్నుడు వేరొకరులేడు. విశ్వరూప

---

1-2. వేంకటరావు, కమలాకర-నవ్యాంధ్రలో కృష్ణాపత్రిక స్థానము-కృష్ణారావు గారు (వ్యాసం) - పుట. 17, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాద కుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ : 1964.

సందర్శనంవంటి ఆయన వాక్యామృతం గ్రోలే మహాభాగ్యం ఆయన దరిచేరిన వారం దరికీ లభించేది.

కృష్ణారావు చిత్తసౌధానికి రెండంతస్తులు - క్రింది అంతస్తులోంచి మాట్లాడేటప్పుడు నవ్వులూ, పువ్వులూ, పన్నీటిజల్లులూ నిరంతరం కురుస్తూ వుండేవి. ఈ జగత్తులో ముట్నూరి హాస్యం చెయ్యని వస్తువులేదు. ఎవ్వరినీ నొప్పించక, అందరినీ ఉల్లాస తరంగాల్లో తేలియాడించే హాస్యమది. తరచుగా ఆయన తనకు తాను హాస్యం చేసుకోవడం కూడా వుండేది. దున్నపోతుగంట, నరవాహనం, ప్రేతభూమి అంటూ ప్రస్తావించి మృత్యుదేవతను పట్టుకొని వసంతాలాడటం కూడా ఆయనకొక సరదా. మృత్యువు సుందరమైంది, అతిశాంతమైంది. 'జీవితమొక ప్రశ్న అయితే; మృత్యువు ఒక జవాబు' అనే వాడాయన.

ఇక పై అంతస్తుల్లోకి వెళ్ళి మాట్లాడేటప్పుడు మరొక స్వరూపంలో కృష్ణారావు దర్శనమిచ్చేవాడు ఆ అంతస్తు ఆయన పూజాగృహం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే జ్ఞానదృష్టితో భక్తి ప్రపత్తులతో లోకంలోని ప్రతి వస్తువుకూ పూజా పుష్పా లర్పిస్తూ వుండేవాడాయన.

సతీ వియోగ దుఃఖం ప్రాప్తించిన ఒక అంతేవాసిని పరామర్శిస్తూ మృత్యువు గురించి—

> "దుఃఖరసాన్ని పూర్తిగా అనుభవించు. కరుణరసప్రధానమైన గ్రంథ పఠనంతో దానినింకా పొంగులువారేటట్టు చెయ్యి. అది నీ కుసంస్కారాల నన్నింటినీ క్షాళనంచేసివెయ్యగల అమరగంగావాహిని. దానిలో నీవు ఎంత బాగా సుస్నాతుడవైతే అంతశాంతీ, అంత సుఖం నీకు కలుగుతుంది. ఇది దైవదత్తమైన అమూల్యావకాశం. దుఃఖించు, దుఃఖించు"[1] అని ముట్నూరి ముచ్చటించిన విధానాన్ని బట్టి ఆయనలోని గంభీరమూర్తి గోచరిస్తాడు.

---

1. వేంకటరావు, కమలాకర - నవ్యాంధ్రలో కృష్ణాపత్రిక స్థానము-కృష్ణారావు గారు (వ్యాసం), పుట. 18, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ.

ఈ ఉపదేశాచరణ పర్యవసానం శాంతి, ఆనందంకాబట్టి కృష్ణారావు దుఃఖిస్తూ దుఃఖిస్తున్నట్లు కనిపించేవాడు కాడు. కృష్ణారావు ఏకైక కుమారుడు ఆయన కళ్ళ ముందే మరణించాడు. ఆయన రెండవ అల్లుడు కూడా పిన్నవయసులోనే మృతి చెందాడు. కృష్ణారావు ప్రథమ పుత్రికను క్షయవ్యాధి చావనీయకుండా చాలాకాలం బాధించింది. చివరకు ఆమెకూడా చనిపోయింది. జీవితంలో ఇలాంటి విపత్తులెన్నో ఎదుర్కొన్నా ఆయన ఏ మాత్రం చలించక పోవడమే ఆయన అద్భుత నిగ్రహాన్ని తెలియజేస్తుంది.

కృష్ణారావు స్వేచ్ఛాప్రియుడు. ప్రకృత్యారాధకుడు. మౌనంగా ప్రతినిత్యం శిల్పాలను అర్చించేవాడు. కృష్ణాపత్రిక కార్యావరణంలో అందమైన పూలమొక్కలు నాటి సంరక్షించేవాడు. అందుకే దర్బారీయులు ఆయనకు 'తోటానందులు' అనిపేరు పెట్టారు. అంతేకాదు ముట్నూరికి పూర్వ సంస్కృతి సంప్రదాయాలమీద ఎనలేని అభిమానం. రామలక్ష్మణుల సోదరప్రేమ, భరతుని త్యాగం తలచి ఉప్పొంగిపోయే వాడు. 'సోదరభావం, పితృభావం, మాతృభావం మన సంస్కారానికి, జాతికి శాశ్వత సంపదలు' అని ఆయన చెప్పేవాడు.

> ముట్నూరి జాతీయ సమైక్యవాదికూడా. వివాహాల గురించి ప్రస్తావిస్తూ— "మన పిల్లను కాశ్మీరులో యువకునికి యివ్వాలి. అక్కడి పిల్ల నిక్కడివారి కివ్వాలి. అలా వివాహాలు చేసుకుంటూపోతే కొంతకాలానికి దేశమంతా ఒకే మాదిరి పూలతోటగా మారిపోతుంది. సంకుచితభావాలు నశిస్తాయి. స్వార్థాలు తొలగిపోతాయి. జాతీయత అనే మాటకు అర్థం వినిపిస్తుంది."[1] అనేవాడాయన.

## ముట్నూరి రచనలు :

కృష్ణారావు పరిపక్వత చెందిన రచయిత. ఆయన సంపాదకీయాలకు సాహిత్య గౌరవం కలిగించాడు. ఆ సంపాదకీయాలతో ఆంధ్ర శారదను అలంకరించాడు. 'కవి ప్రశంస' (1913) 'ప్రణయకీర్తనము' (1916), కుమార సంభవము'(1916),

---

1. వేంకట సత్యనారాయణ, రావూరు - మా గురుపాదులు (వ్యాసం), పుట. 21, కృష్ణాపత్రిక వజ్రోత్సవసంచిక, సంపాదకుడు: ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ

శాకుంతలము (1916), 'రసస్వరూపము' (1917), 'కావ్యజగత్తు' (1920), 'మేఘసందేశము' (1933), మొదలైన సాహిత్య సంపాదకీయాలను ముట్నూరి వెలువరించాడు. ఆయన సంపాదకీయాల్లో భాష, భావం పందెం వేసుకున్నట్లు పరుగులు తీస్తాయి కాబట్టే ఆ సంపాదకీయాలకు సాహిత్యంలో శాశ్వత స్థానం ఏర్పడింది.

ముట్నూరి కలం ఎప్పుడూ ఉద్విగ్నమైన, ఉజ్జ్వలమైన, ఉపజ్ఞాపూరితమైన, ఊహాతీతమైనభావాలనే సంతరించుకొని కృష్ణాపత్రిక పుటల్లో ముత్యాలముగ్గులు పెట్టేది. అందువల్లనే ఆయనను 'రసతపస్వి'గా పేర్కొన్నారు. కృష్ణారావు సంపాదకీయాలు రాజకీయ, సాంఘిక, సాహిత్య, భౌగోళిక విషయాలకు పరిమితం కాకుండా, కళాదర్శనం, సౌందర్య దర్శనం, ఆత్మ దర్శనం మొదలైన విషయాలను వెలార్చేవి. ఆయన ఏది రాసినా పరిపూర్ణత గోచరించేది. భావతీవ్రత ప్రస్ఫుటించేది.

అవి సంపాదకీయాలా - కాదు, అద్భుత సందేశాలు. అవి వ్యాసాలా - కాదు, కృష్ణారావు గుండెలనుండి గుమ్మరించిన వెలుగు దొంతరలు. ఒక వేదాంతి దేశనాయకుడుగామారి, కవిగా కలం చేతబట్టి వెదజల్లిన వెన్నెల విత్తనాలు. అందుకే వెంకటపార్వతీశ్వరకవి ఇలా అన్నారు—

"కృష్ణారావుగారు గొప్పకవి సుమా !"[1] అని. అవును-ఆయన కవిగానికవి.

"కృష్ణారావుగారు ఉచ్చరించే ప్రతి వచనమూ ఒక నిర్వచనం. రచించే ప్రతి వాక్యమూ ఒక గద్యకావ్యం. ఆయన అభివ్యక్తిలో లోతైన దార్శనిక చింతన మేళవిస్తుంది. రసానుభూతి అనుమేళిస్తుంది. ఆయన జీవితం ఈ రెంటితో ప్రతిధ్వనిస్తుంది, ప్రతిబింబిస్తుంది"[2] అని ముట్నూరి గురించి ప్రముఖ విమర్శకుడు సంజీవ్‌దేవ్ రాశాడు.

---

1. వెంకట సత్యనారాయణ, రావూరు-'నెలవంకలోజింక' (వ్యాసం), పుట. 62, మన ముట్నూరి - కళాప్రపూర్ణ రావూరు, డా. రావూరు దబ్బయ్యావ జన్మదినోత్సవ సమ్మాన సంఘం, హైదరాబాద్, 1981.
2. సంజీవ్‌దేవ్-దృక్కోణం (ముందుమాట) పుట. 2 - రసతపస్వి కృష్ణారావు-సంకలనకర్త, ప్రచురణకర్త - గొట్టిపాటి వెంకట సుబ్బయ్య, ప్రథమ ముద్రణ : 1972.

కృష్ణారావు జీవితంలోని చరమదశలో తన అనుభవసారాన్ని, తాత్త్వికతను రంగరించి, ఉపనిషద్వాక్యాలను ఉదాహరిస్తూ సరళశైలిలో 'లోవెలుగులు' 'వెలుగు జిలుగులు' అనే శీర్షికలతో కృష్ణాపత్రికలో అనేక వ్యాసాలు ప్రచురించాడు. ఆ వ్యాసాలు ఆయన జీవిత తత్త్వాన్ని తెలిపేవి పాఠకు హృదయాల్లో ఆధ్యాత్మిక భావనలను వెలుగు పందిళ్ళుగా అల్లేవి

కృష్ణారావే కొంతకాలం నిర్వహించిన 'కబుర్లు' శీర్షికలో సంపాదకీయపు భాషకాక, నిజంగా కబుర్లు వింటున్నట్లుండేవి. ఈ శీర్షికలో 1913 లోనే కేపం వ్యావహారిక శైలినే జాతీయం పుట్టిపడేటట్లు ముట్నూరి ఉపయోగించాడు.

> "ముట్నూరివారు ఒక విశిష్టమైన శైలిని కృష్ణాపత్రికలో రూపొందించారు మొదట్లో సంస్కృతపద భూయిష్ఠంగా గ్రాంధికంలో వారి తెలుగు వచన రచన నడిచింది క్రమేణ సరళ గ్రాంథికాన్ని అనుసరించారు. చిట్టచివరకు ధారాళమైన వ్యావహారిక శైలి వారవలంబించారు వారి వయస్సునుబట్టి శైలి కూడా పరిణతి చెందుతూ వచ్చింది."[1] అని డా లక్ష్మణరెడ్డి పేర్కొన్నారు.

## కృష్ణాపత్రిక దర్బార్ :

> "కృష్ణాపత్రిక ఆఫీసు ప్రాంగణం ఒక చిన్ని ఉద్యానవనం, ఒక చిన్ని చిత్రశాల, ఒక పాఠశాల, ఒక రాజకీయ రహస్యాలోచనామందిరం. మునిమాపు వేళల్లో మునిపల్లె — ఒకప్పుడు నర్తనశాల, ఒకప్పుడు రాయల దర్బారు"[2] అని వర్ణించాడు రావూరు.

---

1. లక్ష్మణరెడ్డి. వి. డా.–తెలుగు జర్నలిజం–అవతరణ–వికాసం పుట. 330, ప్రథమ ముద్రణ : జనవరి, 1985

2 వేంకట సత్యనారాయణ, రావూరు–మాగురు పాదులు (వ్యాసం), పుట. 20, కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు . ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ. ప్రథమ ముద్రణ : 1964

అటువంటి ప్రాంగణంలో ప్రతి సాయంకాలం జరిగే కృష్ణరాయ దర్బారు సకలకళానిలయంగా విలసిల్లేది. అక్కడ జమ్ముగడ్డితో కూర్చిన పర్ణశాల 'జమ్మూ మసీదు'లో, సింహద్వారానికి ఎదురుగా 'సింహాసనం' మీద 'శ్రీ గురు గ్రంథ సాహెబ్జీవారు' [కృష్ణారావుకు 'దర్బారు శాయరు' కాటూరి వేంకటేశ్వరరావు పెట్టిన పేరు] ఆసీనులై వుండగా, ఇరుపక్కలా 'దర్బారు శాయరు', 'వంగవాస వటు రాయలు' [పింగళి నాగేంద్రరావు], 'నాట్యాలబాప' [అడవి బాపిరాజు], 'నయగారపుశాస్త్రి' [మల్లాది రామకృష్ణశాస్త్రి], 'జరుక్ శాస్త్రి' [జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి], 'మల్లినాథసూరి' [అద్దేపల్లి శ్రీశైల మల్లికార్జునరావు], 'కాంతం భర్త' [మునిమాణిక్యం నరసింహారావు], డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, రావూరు వేంకట సత్యనారాయణ, కమలాకర వేంకటరావు, పువ్వాడ, కొడాలి ద్వయం, దామరాజు, విశ్వనాథ, కాశీనాధుని, పెనుమర్తి, గొట్టిపాటి, గొర్రెపాటి మొదలైన ప్రముఖులు 'దర్బారీయులు'గా కొలువై ఉండగా దర్బారు జరిగేది.

> "శ్రీవారి దర్బారులో నానాశాస్త్ర సకలకళాభిజ్ఞులును, నవరస భావ సంచారితులైన కవి గాయక పండిత నటకావతంసులును, బహుభంగులైన లోక వృత్తేతిహాసపారంగతులై, చారుచక్షువులుగా గ్రామ పట్టణ జిల్లా రాష్ట్ర వార్తలను ఎప్పటికప్పుడు మూజువాణిగా దశదిశల నుండి శ్రీవారి సన్నిధికి అనుదినము జారవేయు వార్తాహరులును పరివేష్టించి, ఎప్పుడెక్కడ జరిగిన ఆంతర్య రహస్యములను శ్రీవారి సముఖమున నిగూఢముగను, సూచితముగను, ఏకాంతముగను, బహిరంగముగను నివేదించుకొని వెళ్ళిపోతూ ఉండేవారు "1
>
> అని చెరుకువాడ రాశారు.

> "ప్రపంచానికంతకూ 'మౌన ముద్రాలంకారులు' అయిన కృష్ణారావుగారు — మిత్రులకు, దర్బారీయులకూ సాక్షాత్తూ ఒక చాలన నిఘంటువు, కాదు-ఒక విశ్వకళాపరిషత్తు! భూగర్భశాస్త్రం మొదలు భరతనాట్యం వరకూ, ఆయు ర్వేదం మొదలు ఆధునిక ఆటంబాంబు వరకూ అటు షేక్స్పియరు, మిల్టనూ

---

1. వేంకట నారసింహసిద్ధాంతి, చెరుకువాడ-కృష్ణాపత్రిక దర్బార్ (వ్యాసం) — పుట 207; కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ . 1964.

ఇటు కాళిదాసు, భవభూతులూ, అటు గాంధీయిజమూ, ఇటు కమ్యూనిజమూ, అటు చిత్రలేఖనమూ, ఇటు కవిత్వమూ, అటు అర్థశాస్త్రమూ. ఇటు వేదాంతమూ—ఒకటేమిటి సర్వవిషయాలలోనూ సామాన్యజ్ఞానంతో కాకుండా కూలంకష పరిజ్ఞానంతో విమర్శించేవారు, విశదీకరించేవారు. నిజానికి కృష్ణారావుగారితో మాట్లాడడమే, వారి సాంగత్యమే ఒక ఎడ్యుకేషన్[1] అన్న భావరాజు మాటలు ముట్నూరి బహుముఖ ప్రజ్ఞాపాటవాల్ని వెల్లడిస్తున్నాయి.

కృష్ణారావు అపరకృష్ణరాయలై వివిధ విషయాలపై గంభీరోపన్యాసాలు, చర్చలు, సమీక్షలు, వాదోపవాదాలు కొనసాగించేవారు. అది ఒక రసజగత్తు కృష్ణారావు జీవితం ఆ రసజగత్తులోనే తేలియాడింది

ఈ సందర్భంగా కాటూరి వేంకటేశ్వరరావు ముట్నూరిని గురించి రాసిన ఈ పద్యాలు చిరస్మరణీయాలు—

"ఈ క్షోణిన్ నినుబోలు గ్రంథ గురు లేరీ నేటి కాలమ్మునన్
సాక్షాద్బ్రహ్మ పదార్థ నిర్గుణ కథా వ్యాఖ్యాన విఖ్యాతధీ
శిక్షాదైశిక శుద్ధ మానస పుట శ్వేతాక్షరాక్షౌహిణిన్
భిక్షాదాన కళా సమంచిత మహాబ్ధీ ! గ్రంథ సాహేబుజీ !"

కమ్మనికైతగాండ్రు పులకండములొల్కు విదూషకుల్, తధోం
ధిమ్మని నాట్యమాడు నభినేత లనేక కళాప్రవీణులున్
సమ్మతిఁ గొల్వఁగా సగము సాగిలఁబడ్డ త్రిభంగికాకృతిన్
జమ్ము మసీదులో కొలువు సల్పు నినుం గనఁ గన్నుపండువే

చిటికి మాటికిన్ బెళుకు చేఁతల, వంకరమాట పొందు చె
ల్గాటల, లేఁత పోఁడుముల, కాసర కూసర లేకి పల్కు స
య్యాటల మోసులెత్తి తలచై పొదియై పడమొత్తునట్టి ప
స్నీటి కలాపి ముత్తముల నీదరబారున దుమ్మడంగుతన్.

---

1. నరసింహారావు, భావరాజు-పరిచయం [ముందుమాట]. పుట (ii), మన ముట్నూరి - కళాప్రపూర్ణ రావూరు ప్రచురణ : రావూరు డెబ్బయ్యవ జన్మదినోత్సవ సంచిక, హైదరాబాద్, 1981.

సొకెకు సొకెకున్ తరగజాలయి లేచుచు, భంగసంగతం
బై, రసశేఖరమ్మునకు నాకరమై, మినువాకి ముట్టు ప
స్పైరను జల్లు తుంపరలు నీ చిఱునవ్వుల మత్త్వమెక్కి ద
ర్బారున కేవుతన్ శుభ పరంపర లీ నవవర్షవేళలన్.

పేరోలగమ్ము దర్బారులో నీ వుండ
ఢిల్లిలో దర్బారు డిల్లవోయె
మస్తకమ్మున శ్వేత మకుటమీవు ధరింప
నస్తమించిరి కిరీటాధిపతులు
గాంభీర్య గుణమునన్ గవ గూడుటం జేసి
జలధిలో రాచబాటలు రహించె
మౌనముద్రిత భవదాననముద్రి భూ
ప్రజలకు వాచాలతా ప్రభవాస-గె
ఓ గురుగ్రంధ సాహేబ ! ఉదధి వలయి
తావనీ చక్రిమెల్ల నీ యద్వితీయ
మందహాస శాసనమును మౌళిదాల్చి
మేల మాడుతఁ బన్నిటి యోలలాట.1"

కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికల సంపాదకులకు 1929 సెప్టెంబరు 7, 8 తేదీలలో విజయవాడ దుర్గాకళామందిరంలో ఘనమైన సమ్మానం జరిగింది. ఆ సభకు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలనుంచి వర్గ, సాంఘిక విభేదాలకు అతీతంగా ప్రముఖులంతా విచ్చేశారు వివిధ ప్రాంతాలవారు కూడా వచ్చారు. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కొండా వెంకటప్పయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్య, గద్దె రంగయ్య నాయుడు, కె.వి.ఆర్ స్వామినాయుడు, గంపల గూడెం కుమారరాజా, గొల్లపూడి సీతారామయ్య శాస్త్రి ప్రభృతులు సభనలంకరించారు

ఆ సందర్భంగా పువ్వాడ శేషగిరిరావు ముట్నూరిని గూర్చి రాసిన పద్యాల్లో ఒకటి—

---

1 వెంకట్రావు, కమలాకర-నవ్యాంధ్రలో కృష్ణాపత్రిక స్థానం-కృష్ణారావుగారు (వ్యాసం), కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక, పుట. 10, సంపాదకుడు : ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, ప్రథమ ముద్రణ : 1964.

"నీ తలపాగ కుచ్చు రవణించెడి ఠీవియె ఠీవి, యే మహీ
నేతకుఁ జేతఁగాదు గద నీ నడకం గల రాయసమ్ము, కృ
ష్ణా తరళాంబు సంభవ నినాదము పొందదు గాదె త్వద్వచ
స్స్ఫుత తరంగనాద వివశీకృత సర్వజనానుమోదమున్"

ముట్నూరి కృష్ణారావు తన సమ్మాన ప్రత్యుత్తరంలో—
"పత్రికా నిర్వహణము చాలా బాధ్యతతోకూడిన కార్యము భాషా పటుత్వము, రచనా కౌశలము, భావోద్రేకము ఉన్న చాలవు. క్రమానుగతములైన సంప్రదాయములను, ధారావాహికములైన మర్యాదలను గుర్తింపగల చరిత్రజ్ఞానము, ప్రజల నిజమనోరథము నిగూఢ చిత్తవృత్తులను పరీక్షించగల విశాలదృష్టి, దేశ భవితవ్యమును పలక్షింపగల గంభీరవిశ్వాసము పత్రికాధిపతులు అలవర్చుకొనదగిన లక్షణములు వీటి అన్నిటికంటెను గావలసినది నిర్మలమైన సత్యనిరతి"[1] అనే అభిప్రాయాలు పత్రికారచన నిర్వహణలో ఆసక్తిగల వాళ్ళకు ఆమోదయోగ్యాలు, ఆచరణీయాలని చెప్పవచ్చు చివరి రోజుల్లో ఆయనను జలోదరవ్యాధి పట్టి పీడించింది మృత్యువును మాతృమూర్తిగా దర్శించే కృష్ణారావు తమ అవసాన సమయంలో కూడా మౌనవేదనను అనుభవిస్తూనే ప్రళయతాండవవేళ పరమశివుని కేళీవిలాసంగా దానిని భావిస్తూ జర్జరదేహాన్ని నిర్జించి పరమ శాంతిని పొందాడు. ఆయన జూన్ 23, 1945న దివంగతుడయ్యాడు.

ముట్నూరి నిర్యాణానంతరం కొందరు ప్రముఖులు ఆయనకు నివాళులు అర్పించారు వాటిలో కొన్ని—

"తెలుగు జర్నలిజం ఒక విజ్ఞానరాశిని కోల్పోయింది. ఈయన భాషాపటుత్వం కలవాడు తేజస్వ్వంతంగా కలం నడిపినవాడు ఏకాంతంగా ఉంటారు. నలుగురైదుగురు ఆత్మీయులతో చాలా ఆప్యాయంగా ఉండేవారు. జీవితం నుంచి నిత్యానుభవంవల్ల వడకట్టిన విజ్ఞానమే వీరి వేదాంతం. ఆ అనుభవాల నుంచి అవసరమైనప్పుడల్లా తమ సిద్ధాంతాలను చేసుకొంటూ జీవితంలో నిమ్నోన్నతాలను చక్కదిద్దుకొనేవారు ఆయన చెప్పింది వింటూండటమే

1. వేంకట సుబ్బయ్య, గొట్టిపాటి _ రస తపస్వి కృష్ణారావు, పుట. 45., ప్రథమ ముద్రణ : 1972.

చదువుకోవడంవంటివి సగుణోపాసకులు, నిత్యభావనయందు మహాపురుషుల విశేషాన్ని అనుసంధానం చేసేవారు. భావాంబర వీథుల్లో ఉండేవారు"[1] అని కాసా సుబ్బారావు అన్నాడు.

"సౌందర్యోపాసకుడు, రసమూర్తి. అతని దృష్టి ప్రసరించునేల పూలవనము, భావముదయించునెడ చిత్రవిలాసము ధర్మోదయమ్మున వాఙ్ముఖ శ్రీకలాపము, ఉద్వేగవేళ నటనోత్సాహము"[2] అన్నాడు పింగళి నాగేంద్రరావు.

"అరవిందుడు తత్త్వవేత్త రవీంద్రుడు రసపిపాసి మహాత్ముడు కర్మయోగి. ఇతరులకు వీరి ముగ్గురి మధ్య సామ్యంగోచరించక పోవొచ్చు. కాని, వీరు ముగ్గురుకూడా శ్రీ కృష్ణారావుగారికి గురుపాదులే అదే ఆయన ప్రత్యేకత. అదే ఆయన విశిష్టత,"[3] అని ఆంధ్రప్రభ సంపాదకీయంలో రాశారు.

"రవీంద్రులు భారతదేశము గురుదేవులు, కృష్ణారావుగారు ఆంధ్రుల గురుదేవులు. నాకు అంతకుమించిన గురుదేవులు "[4] అన్నారు బెజవాడ గోపాలరెడ్డి.

"కృష్ణాపత్రిక, కృష్ణారావు, కృష్ణాస్రవంతి ఆంధ్ర జీవనానికి త్రివేణీ సంగమం. వారిసందేశాన్ని ఆంధ్రజాతి గౌరవాదేశంగా తలదాల్చి ముందడుగు వేసింది నవ్యాంధ్ర నిర్మాణానికి ఉరుకులెత్తి పరువులు సాగించింది"[5] అని వ్రాకుచ్చాడు వావిలాల గోపాలకృష్ణయ్య

---

1. సుబ్బారావు, కాసా (ఇండియన్ ఎక్స్‌ప్రెస్) - కృష్ణాపత్రిక - 1945 జూన్ 30, పుట 35
2 నాగేంద్రరావు, పింగళి – స్వర్గసీమకు రత్న నీరాజనము ( వ్యాసం ), కృష్ణాపత్రిక-1945 జూన్ 30. పుట 4.,
3. ఆంధ్రప్రభ సంపాదకీయం–కృష్ణాపత్రిక–నార్ల వెంకటేశ్వరరావు 194, జూన్ 30, పుట 6
4. గోపాలరెడ్డి, బెజవాడ–ఆంధ్రుల గురుదేవులు–కృష్ణాపత్రిక 1945 జూన్ 30, పుట 12.
5. గోపాలకృష్ణయ్య, వావిలాల–నాజోహారులు-కృష్ణాపత్రిక 1945 జూన్ 30 పుట. 6.

"మచిలీపట్నమునకు శ్రీ కోపల్లె హనుమంతరావు, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యలు త్రిమూర్తుల వంటివారు వీరిలో కృష్ణారావుగారు సరస్వతివలె అంతర్వాహినిగా ప్రవహించి ప్రకాశించిరి. ఆయన ఒక శకమునకు ప్రతినిధి. ఆయనతో ఆ శకము కూడ అంతరించినది."[1] అని నివాళులర్పించింది ఆంధ్రపత్రిక.

పై విధంగా ముట్నూరి కృష్ణారావు ఆదర్శవంతమైన జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని ఈ ప్రకరణంలో వివరించడమైంది.

---

1. మాటలను మించిన మౌనం - ఆంధ్రపత్రిక సంపాదకీయం - పుట. 6., కృష్ణాపత్రిక-1945 జూన్ 30.

# కృష్ణాపత్రిక - సాహిత్యం

తెలుగు జాతిని చైతన్యవంతం చేసిన కృష్ణాపత్రిక రాజకీయరంగానికే కాక, సాహితీరంగానికి కూడా ఎనలేని సేవచేసింది తెలుగుభాషా, సాహిత్యాలకు సంబంధించిన ప్రముఖ కవుల, రచయితల, పండితుల రచనలను అందరి పాఠక లోకానికి అందించింది.

## నాటినేటి కృష్ణాప్రతిక సాహిత్యసేవను—

1. గేయాలు 2. పద్యాలు 3. కవితలు 4. కథలు, కథానికలు 5. నాటకాలు, నాటికలు, ఏకాంకికలు 6 నవలలు 7 వ్యాసాలు 8 సంపాద కీయాలు 9. విమర్శలు 10 గ్రంథ సమీక్షలు 11 ఇతరాలు

అనే శీర్షికల క్రింద ఈ ప్రకరణంలో పరిశీలించడమైంది ఇతరాల్లో శ్లోకాలు, స్వీయచరిత్ర, జీవితచరిత్ర, పేరడీలు, లేఖలు, సంభాషణలు, హాస్యోక్తులు, సుభా షితాలు, బుఱ్ఱకథలు, వార్తలు, ప్రకటనలు, బిరుదాలు మొదలైన అంశాలు చేర్చడమైంది.

## గేయాలు

### 1905

హిందూదేశపు మొఱ [The cry of Mother India] -(1. హిందువులారా! 2. తల్లీ ! తల్లీ !), డి 15, పు. 9.

### 1908

మాతృ భిక్ష (సంస్కృత గేయం), ఫి. 16, పు 3.

### 1911

భరతపుత్రుడా మేలుకో (ఆంధ్ర జాతీయ కళాశాలలో వినాయక చతుర్థి సందర్భముగా పాడిన పాట)—సె 1, పు. 9.

### 1912

దసరాపద్యములు [విద్యార్థి పాటలు] (ఈశ్వరస్తుతి, రాజభక్తి) - చే వేంకట నరసింహం-అ. 5 - పు. 7, 8;

మనిషి - గురజాడ అప్పరాయకవి - డి. 14 - పు 6;

## 1913

దేశభక్తి (దేశమును ప్రేమించుమన్నా) - గురజాడ అప్పారావు — ఆ. 9 - పు. 9;

## 1914

గౌతమీ సమాశ్వాసము - శ్రీపాద కృష్ణమూర్తి - మా 14 - పు 12;

## 1915

లంగరెత్తుము—గురజాడ అప్పారావు-జ. 23 - పు. 8;

జోలపాట - సె. 4 - పు 8;

జాతీయ గీతములు - సె. 18, పు. 12;

వాడుక తెనుగు - గరిమెళ్ళ సత్యనారాయణ - డి. 11, పు. 12;

## 1916

జాతీయ కీర్తన — ఆ 26 - పు. 3;

పడవపాట - సె. 9 - పు 10;

చమత్కార పదములు - న. 11, 18, 25 డి. 2, 16, 23 - పు. 8, 9-10-6-7,8-9-8;

గీతము [ మౌలానారూమ్ అను పారశీక గీతము యొక్క అనువాదం ] - ఉమార్ అలీషా కవి-డి 9 - పు 8, 9;

## 1917

మధురకవితలు (తుమ్మెద పదాలు) - వేటూరి ప్రభాకరశాస్త్రి - జ. 13, పు. 8, 9;

మనుమని పాట - ఫి 17 - పు. 3;

పదములు_పాటలు-అచ్యుతరావు - ఫి. 17 - పు 7;

బిచ్చపుపాట — మే 5-పు 9;

గోపాలరాయా - జూ. 23 - పు. 9;

ముద్దుల నాయెంకి - నండూరి వేంకటసుబ్బారావు-సె. 8-పు 9;

## 1920

బాలకృష్ణుడు-బెల్లంకొండ కనకమ్మ - జూ. 19 - పు. 6;

చిరవియోగము - జూ 26 - పు. 8;

భ్రమరగీతం - ము. వె.న. రావు — జు. 10 — పు. 8;
వాతల్లి - ఆ. రామలింగస్వామి — జు. 31 పు. 9;

1921

రాట్నంపాట - మా. 12 - పు. 9;
రాట్నపుపాట - కాటూరి వేంకటేశ్వరరావు - మా. 19-పు 7;
చెల్లెలా - రాట్నమహిమ - జు 2,-పు. 4;
చీరాల కోలాటము - చి. శ్రీనివాసరావు - జు. 9-పు. 9, 10;

1923

చందమామ - గుంటూరు సుబ్రహ్మణ్యము - మా. 24-పు 10;
గీతిక - కవికొండల వేంకటరావు - ఏ 21-పు. 4;
తువ్వపాట - కవికొండల వేంకటరావు - జు. 21-పు. 12;
కాపుపిల్ల - (కవిపేరు లేదు)-ఆ. 11-పు. 14;
బుడబుక్కలపాట - అ. 6-పు. 13;
ఎన్నికల గారడీ - అ. 6-పు. 15;
తుమ్మెద పదము - అ. 13-పు. 8;
ముష్టిపాట - ఆ. 13-పు. 13, 14;

1924

చంద్రవంక - మల్లవరపు వేంకట కృష్ణారావు - మా. 8-పు 9;

1926

ప్రణయ బాష్పములు [ర మ.]-కవికొండల వేంకటరావు-జూ. 26-పు. 11;
ప్రణయోత్కంఠ, ప్రణయజ్యోతి [ర. మ.] - కవికొండల వేంకటరావు — జు 17-పు. 11;
ఎద-దాని కదలిక [ర మ.] - యస్. జి ఆచార్య-జు. 24 - పు. 11;
తెరువరి [ర.మ.]-ఈశ్వర్-అ. 28-పు. 11;
ఆంధ్రయూనివర్సిటీ [ర. మ.]-గరిమెళ్ళ సత్యనారాయణ-సె. 11, 18-పు. 10-16;
కాంగ్రెస్‌లో గలభా-సె. 25-పు. 16;
రాజభక్తిగీతము - గరిమెళ్ళ సత్యనారాయణ-అ. 2-పు. 6;

తుమ్మెదపాట-చెలకువాడ నరసింహము-అ. 9-పు 5;
బుడబుక్కలపాట-ఆ 23-పు. 9,
స్వయం సమరము [ర.మ.]-నేలటూరు అనంతాచార్యులు-అ 23-పు. 11;
ఆనందము [ర.మ.]-ఊటుకూరు సత్యనారాయణరావు-న. 20-పు. 11;
పదరా పోదాము-పల్లెటూరికి మనము-న. 27-పు. 6;

## 1927

ఆది స్వతంత్రము-గరిమెళ్ళ సత్యనారాయణ-జ. 1-పు. 13, 14;
నెమలిపాట-గరిమెళ్ళ సత్యనారాయణ-జ. 8-పు. 11, 12;
రాజ్యమునకొక బాట-గరిమెళ్ళ సత్యనారాయణ-ఏ. 2-పు 11;
మోహనరంగడి పదములు-గరిమెళ్ళ సత్యనారాయణ-ఏ 16-పు. 11;
నవోనవోజయ-కవికొండల వేంకటరావు-మే. 7-పు. 11;
మోహనగంగా!-కవికొండల వేంకటరావు-మే. 14-పు. 9;
వచ్చేరాయలు కమీషను-సె. 17-పు 19.

## 1928

తడికపాట-ఫి. 18-పు. 5;

## 1929

భారతవీర ప్రబోధము [ర.మ.]-సాయం వరదాదాసు-జ 26-పు 9;
జయగీతము-గిరికుమార-ఏ. 13-పు 9;
ఆనందమేగానమాయెనే-తురగా వెంకట్రామయ్య-న. 2-పు. 11;

## 1931

పావలి తీగపదము [ర మ]-కవికొండల వేంకటరావు-ఆ. 1-పు 11;
చానచలువ [ర మ]-కవికొండల వేంకటరావు-ఆ. 15-పు. 11;
కిరణావళి [ర మ]-అజ్ఞాతకవి-సె 5-పు 11.
కవి [ర. మ] - కవికొండల వేంకటరావు-సె. 5, 12, 26-పు 11-8-11, 12;
జాతీయజెండా గీతము-గురజాడ రాఘవశర్మ-ఆ 10-పు 16;
భారత జెండా-డా. వేంకట నరసింహారావు-ఆ. 17-పు 11;
మూడణాలపాట-కొసరాజు రాఘవయ్యచౌదరి-కి 26-పు 19;

## 193

మెట్టి-సబ్నివీసు గురునాథరావు-ఫి. 8-పు 12;

ఆహ్వానము-చక్రవర్తి రాఘవాచార్య-ఫి. 15-పు. 12;

తెలుగక్క-అన్నల ముద్దు తమ్ముండ-త్రిపురాన సత్యానందరావు-ఫి. 22-పు. 11;

పండగ-రావూరు-మా. 28-పు. 12;

చిన్నికృష్ణా-రావూరు-జూ. 27-పు 12;

మార్పు-సబ్నివీసు గురునాదరావు-జు. 4-పు 11;

పాతపాటలు [ఓలిపదము]-సబ్నివీసు గురునాథరావు, సబ్నివీసు రామారావు జు. 18, ఆ. 1, 15, సె. 5, 26, అ 3-పు 12-12-19-18-3-10;

కొలిసేనోయి-అత్తిలి సూర్యనారాయణమూర్తి-జు 18-పు. 12;

పెళ్ళిమాటలు-బొడ్డు బాపిరాజు-సె. 26-పు. 8;

పాతపాటలు-దర్భా విశ్వనాథము, చోడవరపు రాధాకృష్ణశాస్త్రి-డి 5, 26-పు 10-10;

## 1937

జయభేరి మ్రోగింది-మల్లాది చంద్రశేఖరరావు-ఫి. 6-పు 12;

పాతపాట [ఓలిపదము]-సబ్నివీసు గురునాథరావు, సబ్నీవీసు రామారావు-ఏ. 17-పు 10;

చందమామ-బొడ్డు బాపిరాజు-మే. 15-పు. 8;

జాతీయ పతాకగీతిక-కవికొండల వేంకటరావు-ఆ. 21-పు. 12;

## 1938

ఆంధ్రులం, మే మాంధ్రులం-జూ. 4-పు. 7;

పాతపాట-R-ఆ 22-పు 24;

చిలుక పాట-దాసు గోవిందరావు-న 19-పు. 21;

## 1939

తెలుగుజెండా బయలుదేరింది-తెలుగుఢంకా దిశల మ్రోగింది-సె.2-పు. 7;

## 1940

కాంగ్రెసుంటే కక్షకాదోయ్-పింగళి వేంకట సుబ్బారావు-మా. 2-పు. 10;

'చిరంజీవి' పాటలు-మా. 30, ఏ. 20, మే. 4, జూ. 1, డి. 21-పు. 16-15-6-8-10;

నవ్వవోయీ, గాంధీ-సారధి-ఆ 10-పు. 10;

అంపకాలు [బాపిరాజుకు]-పిఠపాటి వేంకట రమణయ్య-డి. 28-పు 4.

## 1941

మందార-రావూరు-ఫి 1-పు. 10;

కొత్తకోడళ్ళ పండుగ-సింగరాజు వేంకటసుబ్బారావు-ఫి 8-పు 10;

[క]వన విహారము-పిల్లలమర్రి వేంకట హనుమంతరావు-ఫి 15-పు 18;

చిరంజీవి పాటలు-ఫి. 22, మా. 1, మా. 22, ఏ. 19, న. 8-పు. 12-18-10-10-6;

కృష్ణవేణి [రసాంజలి]-భరతనాట్యాలబావ-మా. 15-పు 19;

గాంధీమహరాజ్-రవీంద్ర కవిప్రణీతము-మా 22-పు 8;

దేవకన్యకలం-మేము-దేవకన్యకలం-రాచమళ్ళ రామారావు-మా.29-పు.16

బాలానందం-కృ.ప సం-ఏ 5, 19-పు 8-9;

చిలుకా-మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి-మే. 17-పు. 10;

## 1942

పన్నీటిజల్లు [ విశ్వనాథ సత్యనారాయణ సత్కారం సందర్భంగా ] -దర్బార్ శాయర్-జ. 24-పు 6;

జాతీయగీతిక-పి గణపతిశాస్త్రి-ఫి 28-పు. 6;

ప్రియాగమనం-ఫి. 28-పు. 6;

## 1943

చెంచుపాట-రావూరు-ఏ. 10-పు 2;

## 1944

శాకంభరి-పింగళి నాగేంద్రరావు-ఏ. 8-పు. 11;

ఎడారి-జ్యోత్స్న-జూ. 17-పు. 9;

రతనాల పూబొమ్మ-జ్యోత్స్న-జు. 22 పు 4;

## 1945

విద్యార్థి-జయ-ఫి. 3-పు. 10;

పండువెన్నెల-జ్యోత్స్న-మా. 10-పు

ఓ గురూ !-చిరంజీవి-జు-28-పు 12;

.........

# పద్యాలు

## 1902

ఎడ్వర్డు ప్రభు కిరీటధారణ పట్టాభిషేక రత్నములు [The Coronation Verses] -దాసు నారాయణరావు-ఆ 15-పు. 4, 5;

ఆర్య విజ్ఞాపన నవరత్నములు-న. 1-పు. 4;

## 1908

ఐకమత్యమే మోక్షప్రదము [ బిపిన్ చంద్రపాల్‌పై ] - ఒక దేశభక్తుడు-ఫి. 2-పు 4;

ఆంధ్రరాజ్య జయంతి [శ్రీకృష్ణదేవరాయ ప్రభు జన్మదినమహోత్సవము] - ఆన్నే నాగయ్య-మా. 1-పు. 5;

స్వాగతము-మా. 8, పు, 2;

విపినచంద్రవిమోచనోత్సవము-ఒక ఆంధ్రకవి-మా. 22-పు.6;

కాన్ఫరెన్సు పద్యములు-చంద్రమౌళి చిదంబరరావు-జూ. 7-పు. 4;

శనిగ్రహము-న 29, పు. 10

## 1910

కబీరదాసు-సాక్ష్యము-ఏ 1, పు 7;

ఆంధ్రజాతీయ కళాశాల ఉపక్రమణోత్సవ సందర్భమున చదువబడిన పద్యములు-చిల్లిగె శ్రీనివాసరావు, తిరుపతి వేంకటేశ్వర కవులు-ఏ 1-పు 8;

ఎడ్వర్డు ప్రభు నిర్యాణము-మే. 20-పు. 9;

మేఘమునకు సుకవికిని ద్వైరథ్థి-జూ. 10-పు. 8;

## 1911

చంద్రగ్రహణము-గుండు అచ్చమాంబ-మా. 22-పు. 6;

ఉషఃకాల విహారము-వేముగంటి కృష్ణారావు-మా. 31-పు. 7;

అభినవ భారతము-రెంటాల వేంకట సుబ్బారావు-మే 19-పు 7,8;

శ్రీ రాజారావు కుమార వేంకట మహీపతి సూర్యారావు బహద్దరు (స్వాగత పంచ రత్నావళి)-మే 26-పు 4;

జార్జి మహాచక్రవర్తి-శతావధానులు తిరుపతిశాస్త్రి-జూ 14;

సంగమేశ్వరస్వామిపై పద్యాలు (సంగీత విద్వాంసుడు)-జు 28-పు. 7;

సుబ్బరాయశాస్త్రి, జె. హెచ్ స్టోన్‌లపై భగవంతరావు రాసిన పద్యాలు; సె. 1-పు. 9;

నైజాంగారి నిర్యాణము-మాడపాటి హనుమంతరావు-సె. 8-పు. 4;

నిర్యాణ స్మృతి-రాయప్రోలు సుబ్బారావు-సె. 15-పు. 5;

పండిత లక్షణము-పాటిబండ సూర్యనారాయణరావు-అ. 13-పు. 7, 8

నిజాంగారి నిర్యాణము-అదాలతు శేషగిరిరావు-అ. 20-పు. 8;

వితంతు విలాపము-కోటగిరి వేంకట కృష్ణారావు-అ. 27-పు 8;

వారణాసి రామసుబ్బయ్యగారు-చల్లా పిచ్చయ్య-అ 27-పు 8, 9;

ఎడ్వర్డ్ ప్రభువుపై పద్యాలు-శ్రీ వత్సవాయ నీలాద్రిరాజు-న 3-పు 7;

గీర్వాణవిద్యా-శూద్రులు-దేవినేని సూరయ్య-న. 10-పు 9;

గంగానది (సుబ్రహ్మణ్యశాస్త్రి పద్యాలు)-ఒక పురవాసి-న. 10-పు. 9;

శ్రీనివాస నిర్యాణము-వేటూరి ప్రభాకరశాస్త్రి-న. 24-పు. 4;

శ్రీ రాజ దంపతులకు స్వాగతము—ఆశీర్వచన పద్యములు

1) ఒక ఆంధ్రుడు
2) మంగిపూడి వేంకట శర్మకవి
3) తిరుపతి వేంకటేశ్వర కవులు
4) గుడ్లపల్లేటి వేంకటరత్నం-డి 8-పు, 6 7;

శ్రీ జార్జి మహాచక్రవర్తి పట్టాభిషేక మహోత్సవము (ఆంధ్ర కవులకు స్వాగతము) - 1) పోరంకి కుప్పుస్వామయ్య 2) మంత్రిప్రగ్గడ భుజంగరావు 3) అక్కిరాజు ఉమాకాంతం 4) బెంగుళూరు నాగరత్నాంబ 5) ఎం. గున్నయ్యశాస్త్రి 6) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 7) కులగుర్త లక్ష్మీనరసమాంబ 8) ఆదిపూడి ప్రభాకరరావు 9) తిరుపతి వేంకటేశ్వరులు 10) కొంరి భద్రాద్రిరామశాస్త్రి 11) జయంతి రామయ్య 12) రెంటాల వేంకట సుబ్బారావు-డి. 15-పు 6, 7, 8;

డాక్టరు లక్ష్మీపతి-భోగరాజు నారాయణమూర్తి-డి. 15-పు 10;

## 1912

స్త్రీల నాగరికత-గాలి సుబ్బారావు-జ. 19-పు 8;

ప్రొఫెసరు కోడి రామమూర్తి పై పద్యాలు-ఫి. 2-పు. 4;
పుష్పవాటిక-వేముగంటి రామకృష్ణారావు-ఫి. 2-పు. 6;
గ్రామ్యపదప్రయోగము-శ్రీరాములు సచ్చిదానందశాస్త్రి-మా. 15-పు. 6;
ఒంగోలు పశువులసంత-శతావధాని పిశుపాటి చిదంబరశాస్త్రి-ఏ.12-పు.6;
వార్తా పత్రికలు-చివుకుల అప్పయ్య-జూ 28-పు 4;
కోడి రామమూర్తి నాయుడు-చెన్నాప్రగడ భానుమూర్తి-ఆ 2-పు. 8;
వివిధ పద్యములు-మంగిపూడి వేంకటశర్మ-ఆ 23-పు. 10;
శుకవులు-శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి-ఆ 31-పు 8;
వార్తా పత్రికలు-మంగిపూడి వేంకటశర్మ-సె 7-పు 9;
దధీచి-సోదరకవులు పిప్పర-సె. 7-పు 10;
నాదికాయాత్ర-సోదరకవులు పిప్పర-సె. 14-పు. 9;
ఈగపులి-సోదరకవులు పిప్పర-సె. 21-పు 4;

దసరాపద్యములు (భారతమాతస్తవము, సంఘస్థితి, కర్మవిద్యలు, అంత్య మంగళం)-చే వేంకట నరసింహం-ఆ. పు. 7, 8;

గోదావరి రత్న పంచకం-పిశుపాటి చిదంబరశాస్త్రి-అ 26-పు
కవిత-న. 2-పు. 4;
గ్రామ్య పిశాచము-చివుకుల అప్పయ్య-న. 21-పు 4;

ఆనరబిల్ మోచర్ల రామచంద్రరావుగారు - బందా సూర్యనారాయణ (7-6-1912, 18-1-1913ల మధ్య ప్రచురించబడినది)

## 1913

శూద్ర మహాజనసభ-దేవినేని సూరయ్య-మా 15-పు. 4;
సంవత్సరాది-ము. వేం. సుబ్బారాయుడు-ఏ. 12-పు 6;

జీర్ణాలయ ప్రశంస-దూపాటి తిరుమల శేషాచార్యులు, వేంకట రమణాచార్యులు-ఏ. 12-పు. 10;

అగస్త్య భ్రాత-మంగిపూడి వేంకటశర్మ-ఏ. 19-పు. 9;
జన్మభూమి-ము. సుబ్బారాయకవి-మే. 3-పు 10;
లేశము-ముట్నూరి సుబ్బారాయకవి-మే. 10-పు. 10;
నిశీథము-ము. సుబ్బారాయకవి-మే. 17-పు. 10;
ఆంధ్రమాత-మంగిపూడి వేంకటశర్మ-మే. 24-పు. 6;

ఆంధ్రభారతి-చెన్నాప్రగడ భానుమూర్తి-మే 24-పు. 6;
ఆంధ్రదేశ ప్రశంస-మే 31-పు. 11;
ఆంధ్రోన్మేషణము-సోదరకవులు, పిప్పర-జూ 28-పు 11;
ఆంధ్రజనని-ముట్నూరి సుబ్బరాయకవి-జు 5-పు. 8;
వార్తా పత్రికలు-మంగిపూడి వేంకటశర్మ-జు. 19-పు. 8;
సౌఖ్యజీవి-మ. సోమశేఖరశర్మ-జు. 26-పు. 9
వసంతము-రాయప్రోలు సుబ్బరాయకవి-ఆ. 2-పు 9;
ఆంధ్రోద్యమము-సె. 6-పు 10,
లేఖినీగీతము-శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి-సె. 13-పు. 11;
గీతాంజలి - రవీంద్రనాధ్ ఠాగూర్ - ఆదిపూడి సోమనాధరావు[అను.]-న. 1-పు 6;
పత్రికాధర్మము-ము. సుబ్బారాయకవి-న 8-పు. 5;
కీర్తిశేషులైన బెల్లంకొండ రామారావు-చావలి వేంకటకృష్ణయ్య - న. 15, 29-పు. 16-6;
ఆంధ్రిస్నాతకాధిపత్యము-రాయప్రోలు సుబ్బరాయకవి-న. 29-పు. 6;

## 1914

గౌతమీ సమాశ్వాసము-శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి-మా. 14-పు. 12;
ఆంధ్రదేశ ప్రశంస-ఏ 11-పు. 6;
కృష్ణవేణి-ఏ 11-పు. 6;
ఆంధ్రభాషోద్యమము-కాశీకృష్ణాచార్యులు-ఆ. 1-పు. 11;
కవిత్వం-అబ్బూరి రామకృష్ణారావు-సె 26-పు 12
మహాభారతం [ఆరణ్యపర్వం, ప్రధమాశ్వాసం] - దుగ్గిరాల సూర్యప్రకాశరావు-అ. 10-పు. 10;
కీర్తిశేషులైన రాబర్ట్సు-బి ఉమాకాంతం-న. 28-పు 15

## 1915

సత్కవిస్మరణము-శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి-జ 16-పు. 11;
కృష్ణానది-పోచిరాజు సీతారామకవి-సె. 11-పు 16;

హంసలు నెమళ్ళు మైత్రితో నాడ దొడగె-సె 18-పు.
స్వాగతగీతము-శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి-డి. 4-పు. 8;
నా ముద్దుగుమ్మ-బసవరాజు అప్పారావు-డి. 11-పు 12;
కొండవీడు-కె శ్రీశైలం-డి 11-పు. 13;
ఎవరు-రాయప్రోలు సుబ్బరాయకవి-డి. 18-పు 13;
సహజ లావణ్యము-జి. అప్పారావు-డి 25-పు 4;
జాబిల్లి-ద్రో. వేంకటాచలం-డి. 25-పు 4;
ప్రేమ కారణము-డి. 25-పు 4, 5;

## 1916

స్వప్నావస్థ-పెరవలి అప్పారావు-మే 6-పు. 11;
విస్మృతి-సూర్యనారాయణరావు-జూ. 10-పు. 3;
హిందూ వివాహములు-యమ్. పార్థసారథి-జూ. 10-పు. 9;
అతడే నా యిష్ట సఖుడు-గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మ-జు. 15-పు. 7;
సర్వమును నేనే-గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మ-జు 29-పు. 3;

విద్యార్థులు చదివిన పద్యములు - శ్రీనివాస రామానుజాచార్యులు - కాటూరి వేంకటేశ్వరరావు, రాయల్ థియేటర్ సభ్యులు, వడ్లమన్నాటి నరసింహశర్మ, వి. సత్యనారాయణ, విన్నకోట వేంకటరత్నం, ఆ. 19-పు 6, 7;

అలమొనర్చు లాభమేమి-గుమ్మలూరి లక్ష్మీనరసింహశర్మ-ఆ. 19-పు 10;
కోకిల-ద్రోణావఝుల సాంబశివశాస్త్రి-ఆ. 19-పు. 10;
కోయిల-కలశిపూడి శ్రీశైలం-ఆ. 26-పు. 9;
కోకిల-పింగళి లక్ష్మీకాంతం-సె. 2-పు. 6;

జీవగీతము [లాంగ్‌ఫెలో 'సామ్ ఆఫ్ లైఫ్' అను పద్యావళి అనువాదం] కోపల్లె శివకామేశ్వరరావు-సె. 9-పు. 10;

బాల [వర్డ్సు వర్తు కవిశేఖరుని 'ల్యూసి' అను ఆంగ్లపద్యావళి అనువాదం] విన్నకోట వెంకటరత్నం [అను]-సె. 16-పు. 7, 8;

చిలుక-సత్యాంజనేయులు-సె. 16-పు. 8;
అస్తమయము-వేలూరి చంద్రశేఖరం-సె. 30-పు 2;
మేనకా విశ్వామిత్రులు [చి. మా]-సెట్టి లక్ష్మీనరసింహం-అ 21-పు. 8;

గానము-కలచవీడు వేంకట రమణాచార్యులు, ఎలమర్తి శ్రీనివాసరావు-ఆ 21-
. 11;

రంభాశుకులు [చి. మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-అ. 28-పు. 8;
తుమ్మెద-సత్యాంజనేయులు-న. 4-పు 9;
మదాలసా ఋతుధ్వజులు [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-న. 4-పు. 10;
సుభద్రార్జునులు [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-న. 11-పు. 11;
ఉషానిరుద్ధులు [చి. మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-న. 18-పు. 9;
స్రవంతి సాంత్వనము-గడియారం వేంకట శేషశాస్త్రి-న. 18-పు. 11;
ప్రేమ-ఆచంట బాపిరాజు-న. 18-పు. 11;
ఊర్వశీ పురూరవులు [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-డి. 2-పు. 11,
మాలతి [చి. మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-డి. 16-పు. 8;
రత్నావళి [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-డి. 23-పు 10;

## 1917

ప్రియదర్శిక [చి. మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-జ 6-పు. 10
మనోరమ [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-జ. 13-పు. 10;
వసంతసేన [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-జ. 20-పు. 10;
శకుంతల [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-ఫి. 3-పు. 10;
శకుంతలా పత్రలేఖనము [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-ఫి 17-పు. 10;
తృప్తి-కోపల్లె శివకామేశ్వరరావు-ఫి. 24-పు. 8;
మేనకా శకుంతలలు [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-ఫి 24-పు. 10;
సర్వదమనుడు [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-మా 3-పు. 10;
అహల్య [ఠాగూరివారి గీతకు అనువాదం]-మంగిపూడి పురుషోత్తమశర్మ-
మా. 10-పు. 9;
శకుంతలా దుష్యంతులు [చి. మా ] - సెట్టి లక్ష్మీనరసింహం - మా. 17-
పు. 11;
సంవాదము-చిర్రావూరు కామేశ్వరరావు-మా. 31-పు 9;
గుచ్ఛము-కవికొండల వెంకటరావు-మా. 31-పు. 9;
ఉల్లిసు ప్రభువు తనయ [కాంప్బెల్లు లార్డు ఉల్లిన్ ఆంధ్రీకరణం]-ఏ. 21-
పు. 6;

అకారణ వాత్సల్యము-కలశపూడి శ్రీశైలము-ఏ 21-పు. 8;
మోహిని [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-ఏ 21-పు 11;
సత్సంప్రదాయుఁడై_మే. 5-పు 6;
రంభ [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-మే. 12_పు. 8;
రుక్మాంగదుడు [చి మా ]_సెట్టి లక్ష్మీనరసింహం-మే. 19-పు. 9;
స్వాగత పద్యములు-రాయప్రోలు సుబ్బారావు-జూ. 9-పు 7, 8;
ఉత్సాహగీతము-ఉలుగుండం రంగారావు-జూ 9-పు 8;
సావిత్రి [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-జు. 7_పు 8;
మందమారుతం-కొ. వెం రమణశర్మ-జు 7-పు. 8;
గంగావతరణము [చి మా.]_సెట్టి లక్ష్మీనరసింహం-జు. 14-పు 9;
కన్నప్ప వృత్తాంతం-జు. 21-పు 8, 9;
అజవిలాపము [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-జు 28_పు. 7;
సమాశ్వాసము-కోపల్లె శివకామేశ్వరరావు-జు. 28-పు. 7;
క్లెరీ ప్రబ్వి [టెనిసన్ రచన]-కొ. వెం. రమణశర్మ-ఆ 11-పు. 9, 10;
ప్రణయ నిర్యాణము-కోపల్లి శివకామేశ్వరరావు-ఆ. 18-పు. 9;
దమయంతి [చి. మా.]-సెట్టి లక్ష్మీనరసింహం-సె. 1_పు 9;
వనరాణి-ని స_సె. 1-పు. 9;
దమయంతి హంస సంవాదము [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం - సె 8-పు 9;
క్షేమ_కోపల్లి శివకామేశ్వరరావు_సె, 8-పు 9;
ప్రణయ భంగము-చిత్రావూరు కామేశ్వరరావు_సె. 15-పు. 5;
హంస సందేశము [చి మా.]-సెట్టి లక్ష్మీనరసింహం_సె. 29_పు 10;
దమయంతీ విరహము [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం_ఆ 13_పు 8;
వీరపురుషుని బాష్పవారి-చిత్రావూరు కామేశ్వరరావు_అ. 20-పు. 6;
నలదమయంతులు [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం_న. 10_పు. 7;
దమయంతీ విలాపము [చి మా.]_సెట్టి లక్ష్మీనరసింహం_డి. 8_పు 10;
'రోషనారా' లేఖ-వసంతుడు_డి. 22-పు. 6;

## 1918

సుతుకంకణము_చిత్రావూరు కామేశ్వరరావు-జ 5-పు. 6;

ప్రకృతి పరివర్తనము_కె వి సుబ్బయ్య-జ. 5-పు. 9;
గంగాశంతనులు [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-జ. 5-పు. 10
ఆర్తనాదము-చిల్రాపూరు కామేశ్వరరావు-జ. 12-పు. 6;
మత్స్యగంధి [చి. మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-జ 12-పు. 9;
సత్యవతీ శంతనులు [చి మా ]-సెట్టి లక్ష్మీనరసింహం-జ. 19-పు 10;
సంక్రాంతి పండుగ-దువ్వూరు రామిరెడ్డి-జ. 19-పు. 10;
శివబ్రహ్మైక్యము - పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు - ఫి 2, 16-పు 9, 6;

రవివర్మ బొమ్మలు (భీష్మశపథము) [చి మా.] - సెట్టి లక్ష్మీనరసింహం - ఫి 2-పు. 10;

పండిత జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారి నిర్యాణము-వేంకట శివకవులు - ఫి. 9-పు. 9;

భారత మాతృప్రబోధము-దువ్వూరు రామిరెడ్డి-ఫి. 16-పు 9;
భారతమాత ప్రశంస-యడ్లపాటి వేంకట సుబ్బారావు-మా. 2-పు 9,
తిలకు ఉత్సవము-కలశిపూడి శ్రీశైలం-ఏ. 6-పు. 8;

రవివర్మ బొమ్మలు (ద్రౌపదీవస్త్రాపహరణం) [చి మా.] - సెట్టి లక్ష్మీనరసింహం-ఏ. 13-పు 8-మే. 4-పు 10;

నైజాం రాష్ట్రము-వరదాచార్యులు-ఏ 20-పు 6;
శీతము-మంగిపూడి పురుషోత్తమశర్మ-ఏ. 20-పు. 9;
కవితా సామగ్రి-పింగళి, కాటూరి-న. 2-పు. 9;
శ్రీకృష్ణ నిర్యాణము-దివాకర్ల తిరుపతిశాస్త్రి-న 2-పు 10;
శాంతిసర్పము-మైలవరపు కృష్ణమూర్తి-న. 9-పు. 5;
సమీకమా ? సమాధానమా ?-గిడుగు వేంకట సీతాపతి-న. 23-పు 9;
ఆనంద ధామము-సుధాకరుడు-న. 30-పు. 5;
వియోగము-చిల్రాపూరు కామేశ్వరరావు-న. 30-పు. 5,
ఖద్యోతము-రావులపర్తి సూర్యనారాయణ-న 30-పు 5;
భారతమాత-ఒక విద్యార్థి-డి. 7-పు 6;
అకాలగానము-వి సత్యనారాయణ, కొ ఆంజనేయులు-డి. 7-పు 7;
ఒక మహాత్ముని గమనము-బర్మా-ఉమర్ అలీషా-డి. 14-పు 9;

నిర్యాణస్మృతి [వేదుల వేంకటశాస్త్రి గురించి] - దాసరి లక్ష్మణస్వామి - డి. 21-పు. 4;

## 1919

కర్ణధారుడు-శతావధాని శివరామశాస్త్రి-జ. 11-పు. 4;
చిత్రమన్న చిత్రమా-ఒక ఆంధ్రుడు-జ. 11-పు. 4;
కీర్తి-ఆర్. వి. ఏ-జ. 25-పు. 11;

## 1920

విద్యావధూటి-ముత్తినేని వేంకట చెన్నకేశవులు-ఏ 17-పు 6;
కోయిల-దువ్వూరు రామిరెడ్డి-ఏ. 24-పు 6;
ఏమి చిత్రంబో ఎవ్వరికెరుకలేదు-పుతుంబాక శ్రీకృష్ణయ్య-ఏ. 24-పు 8;
వసంతగానము-వి. సత్యనారాయణ, కొ. ఆంజనేయులు-మే. 1-పు. 6;
'అనువాదము'-మే. 1-పు 6;
చంద్రుడు-ముత్తినేని వేంకట చెన్నకేశవులు-మే. 1-పు. 10;
వసంతము-విద్వాన్ శిష్టా నరసింహశాస్త్రి-మే. 8-పు. 7;
కవితాప్రణయిని-దువ్వూరు రామిరెడ్డి-మే 15-పు. 7;
ఆంధ్ర మాతృస్తవము-జనమంచి సీతారామస్వామి-మే 29-పు. 6, 7;
శాలిపాలిక-చిత్రావూరు కామేశ్వరరావు-జూ 12-పు. 5, 6;
భారత వర్షము-కోన వేంకటరాయశర్మ-జూ. 26-పు. 8;
నేనెరుంగ-నిడమర్తి సత్యనారాయణమూర్తి-జూ 26-పు 8;
కోకిలాకాకము-సి. కామేశ్వరరావు-జు 17-పు. 10, 11;

విషాద గీతములు—

I-హరి నాగభూషణం
II-కాశీనాధుని చినవీరభద్రయ్య
III-ఒక విద్యార్థి
IV-అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి
V- - - -
VI-జనమంచి సీతారామస్వామి ఆ. 7-పు 8, 9;

విషాద గీతములు

VIII-పింగళి నాగేంద్రరావు

IX -వాసిరెడ్డి వేంకట సుబ్బారెడ్డి

X -జంధ్యాల శివన్నశాస్త్రి

XI -నిడదవోలు వేంకటరమణ

XII- వడ్డాది సీతారామాంజనేయులు ఆ. 14-పు. 7, 8;

కొండవీడు-దువ్వూరు రామిరెడ్డి-ఆ 14-పు 8;

చిలుక-తాడంకి లక్ష్మీనారాయణ-సె 4-పు 6;

కాలకాంత-కృత్తివెంటి వేంకట సుబ్బారావు-సె. 18-పు. 9;

ప్రసవసుందరి-శేషాద్రి రమణకవులు-సె. 25-పు 10;

అజ్ఞాన కృతము-పింగళి, కాటూరి-అ 2-పు. 7;

శివాజి-జయంతి గంగన్న-అ. -పు. 7;

దివాకరుని అస్తమయము [విషాద గీతములు]-

I-ద్వివేది నారాయణశాస్త్రి

II-మహాకాళి వేంకటేశ్వరరావు

III-అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి

IV-రాజా మంత్రిప్రగడ భుజంగరావు

V-దీపాల పిచ్చయ్యశాస్త్రి

శరన్నిశి I-కృత్తివెంటి వేంకట సుబ్బారావు-డి. 25-పు 8;

## 1921

శరన్నిశి II-కృత్తివెంటి వేంకట సుబ్బారావు-జ. 1-పు 8;

శ్రీ మహాత్మాగాంధిస్తవాష్టకము-కలవపూడి శ్రీశైలం-జ. 15-పు 8;

కాటూరి వేంకటేశ్వరరావు పద్యాలు-ఫి. 5-పు 5;

గీతము-విశ్వనాథ వేంకటేశ్వర్లు, సర్వా వేంకట శేషయ్య-ఫి. 26-పు. 6,

ఆంధ్రభాషావిలాపము - అవ్వారి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి -మే. 21 - పు. 11, 12;

శ్రీ తోట్లవల్లూరు వేణుగోపాలస్వామివారి కళ్యాణమహోత్సవములో బ్రహ్మశ్రీ

గండికోట నరసింహారావుగారు చెప్పిన హరికథా సందర్భమున-మ॥ రా॥ కొప్పరపు కవులచే చెప్పబడినది-బ్రహ్మశ్రీ చక్రవర్తుల కృష్ణమూర్తి సిద్ధాంతి_జూ. 4-పు. 11;

విద్యా ప్రోత్సాహ నిరసనము-అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి- జూ. 11-పు. 3;

ఆంధ్ర భారతీస్తవము_అన్నమరాజశర్మ-ఆ. 20-పు. 4;

చదువు జీవనము_అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి-న. 19-పు. 4;

మహాత్ముడు-ఉమర్ ఆలీషాకవి-డి. 10-పు. 8;

## 1923

కవిపూజ[చెళ్ళపిళ్ళ, కృష్ణాచార్యులపై]-ఆంధ్ర జాతీయ కళాశాల, బందరు-ఫి 10-పు 12;

గాంధి బందిఖానా_మంగిపూడి వేంకటశర్మ_మా. 17-పు 7;

ప్రబోధశంఖము-దువ్వూరు రామిరెడ్డి-మా. 24-పు. 11;

కుహనా మంజూష-శిష్టా లక్ష్మికాంతం_మా. 24-పు. 11;

కోకిలమ-కోకిలమ !_కవికొండల వేంకటరావు-మా. 31-పు 4;

ఉన్మీలన-రాయప్రోలు సుబ్బారావు-ఏ 7-పు. 10;

అమర రాజ్యము_చిర్రావూరు కామేశ్వరరావు-ఏ. 7-పు. 11;

ఆయువు [ గీ మా ] - కొడాలి వేంకట సుబ్బారావు, కామరాజు గడ్డ శివయోగానందరావు-ఏ. 14-పు 8;

ఆనంద సత్రము-దువ్వూరు రామిరెడ్డి-ఏ 14-పు 11;

నా జీవితాశయము [వ ప.]-చిర్రావూరు కామేశ్వరరావు-ఏ. 21-పు. 4;

భ్రమరగీతం-ఏనుగు తిమ్మకవి-ఏ 21-పు 10;

ప్రబోధగీతిక-పెనుమర్తి వెంకటరత్నము-ఏ 21-పు. 12;

ప్రణయతత్త్వము-'షెల్లీ'-అనుముల వేంకట శేషకవి [అను.] - ఏ 21 - పు. 12;

నిజాం రాష్ట్ర ప్రశంస-శేషాద్రి రమణకవులు-మే. 5-పు. 4;

రత్నహారము_వేంకట పార్వతీశ్వర కవులు-మే. 5-పు. 4;

అపర భీష్ముడు-చిర్రావూరు కామేశ్వరరావు-జూ. 2-పు 5, 6;

నిదాఘగీతి-పెనుమర్తి వేంకటరత్నం-జూ. 9-పు. 10;

పరభృత ప్రకృతి-వేదాంతం శ్రీనివాసాచార్యులు, సీతంరాజు సత్యనారాయణ శర్మ-జూ 9-పు. 10;

దీపములు-గంటి జోగిసోమయాజి-జూ. 9-పు. 10;

పుష్ప విశేషము-రాబర్ట్ హెరిక్-అనుమల వేంకటేశకవి [అను] - జూ. 9-పు. 10;

పరశురాముడు_కొడాలి వేంకట సుబ్బారావు, కామరాజుగడ్డ శివయోగానంద రావు-జూ 23-పు. 10;

శారదా నృత్యము-విశ్వనాథ సత్యనారాయణ-జు 7-పు 13;

కోరిక-కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు-జు 7-పు. 13,

వీడుకోలు-చిత్రావూరు కామేశ్వరరావు-జు. 7-పు 14;

ఆశీస్సు_కొడాలి ఆంజనేయులు-జు 14-పు. 11;

మధురామంత్రణము-చిత్రావూరు కామేశ్వరరావు-జు. 14-పు 12;

అభావప్రాదుర్భావము - జంధ్యాల వేంకటశర్మ, శివన్న శాస్త్రి - జు. 14-పు 12;

ఎడబాపు-కలిదిండి వరాహనరసింహరాజు-జు 21-పు 10;

వర్షాగమము-అబ్బూరు రామకృష్ణారావు-జు 21-పు 10,

శరద్రాత్రి-కామరాజుగడ్డ శివయోగానందరావు, కొడాలి వెంకట సుబ్బారావు-జు 28-పు. 8

సంస్కరణము-పెనుమర్తి వెంకటరత్నం-జు 28-పు 6;

కుసుమమాల [ర. మ]-పింగళి, కాటూరి-ఆ. 18-పు 7;

మార్పు [ర. మ]-నాయని సుబ్బారావు-ఆ 18-పు. 7, 8.

ప్రణయలేఖ [ర మ]-పింగళి, కాటూరి-ఆ 25-పు 7.

తెరచాటు [ర. మ.]-నాయని సుబ్బారావు-ఆ. 25-పు 7;

అభిలాష-[ర మ]-నాయని సుబ్బారావు-సె 8-పు. 7;

మనోచ్చాటనము [ర. మ]-చిత్రావూరు కామేశ్వరరావు-సె. 15-పు 7;

స్వప్న ప్రణయము [ర మ.]-నాయని సుబ్బారావు-సె. 15, 22-పు 7,7;

ప్రేమపాశము [ర. మ.] - 'షెల్లీ' - మాలే రాఘవరావు [అను]-సె 22-పు 7;

ప్రణయలేఖ [ర మ]-సె 29-పు 7:

రాజభిక్షువు [ర. మ ]-చిర్రావూరు కామేశ్వరరావు-సె 29-పు 7,
అనంతాలోకము [ర. మ.]-చిర్రావూరు కామేశ్వరరావు-అ. 6-పు. 7;
నిశాగానము [ర. మ.]-కొడాలి ఆంజనేయులు-అ 6-పు 7;
మేఘాహ్వానము [ర. మ ]-పైడిపాటి చలపతిరావు-అ 6-పు. 7;
దశరాపద్యము-త్యాగయ్యదేవరగారి బసిపిల్లలు-అ. 6-పు. 15;
పువ్వు-తె. కృష్ణమూర్తి-అ 13-పు. 8;
దాగిలిమూత-నాయని సుబ్బారావు-అ 27-పు 7;
ప్రణయకుమారి [ర. మ ] - బాలసరస్వతులు చలమయ్య ప్రసాదులు - అ. 27-పు 7;
భవిష్యత్తు [ర. మ ]-నాయని సుబ్బారావు-న. 3-పు 7;
వేణుగానస్మృతి [ర. మ ]-ఊటుకూరు సత్యనారాయణరావు-న 3-పు 7;
చంపకము [ర మ ]-శ్రీపతి వేంకటరత్నం నాయుడు-న. 10-పు 7;
వర్షము [ర. మ ]-వె. కృష్ణమూర్తి-న. 10-పు 7;
నక్షత్రములు-న. 10-పు. 8;
ప్రణయలేఖ [ర. మ ] - పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు-న. 17-పు. 7;
సమాశ్వాసనము-పెనుమర్తి వేంకటరత్నం-న. 17-పు 7;
దుర్దినము-గంటి జోగిసోమయాజి-న 17-పు 7;
ప్రణయలేఖ [ర. మ ]-పింగళి, కాటూరి-న 24-పు. 7:
ఆశ్రమ ప్రాంతములు [ర. మ ] - సన్నిధానం సూర్యనారాయణ-డి. 1 - పు 7;
శాంతిభిక్ష [ర మ.]-చిర్రావూరు కామేశ్వరరావు-డి. 1-పు 7;
క్రీడాభంగము [ర మ ]-కుమార రాజశేఖరుడు-డి. 1-పు 7;
చంద్రోదయము [ర మ ]-గంటి జోగిసోమయాజి-డి 8-పు 7;
విలాసిని [ర మ ] - సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి - డి. 8, 22 - పు. 7-7;
కవి మనోరథము [ర. మ.]-మవ్వూరు రామిరెడ్డి-డి. 15-పు 7;
శాంతికి ప్రేమ మార్గము [ర మ ]-గంటి జోగిసోమయాజి-డి. 15-పు 7:
ఉపాసన [ర మ ]-చిర్రావూరు కామేశ్వరరావు-డి 22-పు 7;
విలాసిని [ర. మ ]-సన్నిధానం సూర్యనారాయణ-డి 22-పు 7,

